సీతారామకవి, సరస్వతి

మంజులనైషధము చిత్రనళీయము

కాకినాడ, 1926

Record no. 614

Sītārāmakavi, Sarasvati

Mañjulanaiṣadhamanu citranaḷīyamu

Kākināḍa, 1926

Record no. 614

## Bibliographic Record Target

సీతారామకవి, సరస్వతి.

మంజులనైషధమను చిత్రనళీయము / నాటక సరస్వతి సీతారామకవి ప్రణీతము.- 1. కూర్పు.- కాకినాడ : కందుల గోవిందం, 1926.

(1), 102 p. ;23 cm.

Record no. 614

Sītārāmakavi, Sarasvati.

Mañjulanaiṣadhamanu citranaḷīyamu / nāṭaka Sarasvati Sītārāmakavi praṇītamu.- 1. kūrpu.- Kākināḍa : Kandula Gōvindaṃ, 1926.

(1), 102 p. ;23 cm.

Record no. 614

మంజులనైషధమను

# చిత్రనళీయము.

(నాటక సరస్వతి-సీతారామకవి ప్రణీతము)

(ప్రకటనకర్త)

కందుల గోవిందము.

జనరల్ బుక్కుడిపో,

బెజవాడ.



మొదటికూర్పు 1000.

కాకినాడ స్కేప్ అండ్ కో., ముద్రాశాలలో

కె. సుబ్బారాయుసోదరులచే,

ముద్రింపఁబడియె,

కాకినాడ.

1926.



[వెల 1-4-0.

# -: ఉపోద్ఘాతము :-



ఈచిత్రనళీయనాటక మిదివఱకు "ఆంధ్రనాటక పితామహులగు-ధర్మవర్మ కృష్ణమాచార్యులవారిచే రచియింపఁబడి, సుప్రసిద్ధినందియున్నది. అట్టినాటకమును మరల వ్రాయుట గొప్పసాహసమే. కాని దీనికనేక కారణములున్నవి. ఎట్లయినను వ్రాయుసాహసమునకు బాల్పడితిమి. ఈరచనయందెంతవఱకుఁ గృతార్థుఁడనైతినో లోకులు నిర్ణయింపవలయును. సాధారణముగా నిప్పుడు నాటకరచన యదియొక విధముగనున్నది. ఒకరు వ్రాసిననాటకమునే మఱియొకరు వ్రాయుచున్నారు. దీనికి ప్రకటన కర్తలప్రోత్సాహమే యని యెఱుంగవలయును - నేనీనాటకమునకుఁ బీఠిక వ్రాయవలయునను నుద్దేశములేదు. కాని, నానాటకరచన కిది తుది నాటకమని గట్టిగసంకల్పించుకొని వ్రాయుచున్నాను. 1924 సం॥ అక్టోబరు 28 తేదీని, నాయర్ధాంగి గతించుటంజేసి, కవితాసన్న్యాసము స్వీకరింపఁదలంచితినిగాని, విధివశమున శరీరదార్ఢ్యము తగ్గియున్నను, బంధుగృహమునుజేరి జీవయాత్రగడుపుట కిష్టములేక, స్వాతంత్ర్యముగ నెంతవఱకు నితరప్రదేశమున నొంటిగనుండవలయునో చూతమని బెజవాడకువచ్చితిని. ఏకాకినగునా బెజవాడకాపురము మరల నాటకరచనకుఁ బ్రేరేచినది. నాయవసరమును బట్టి తేలికగను వారియవసరమునుబట్టి నాకిట్టింపు ధరకును నాటకములు విక్రయింపఁబడినవి. ప్రకటనకర్తల కీచిత్రనళీయ నాటకము త్వరలోనే యిచ్చెదమని చెప్పియుంటినిగాని అనుకొన్నదానికి రెండురెట్లాలస్యమైనది. దానికి ప్రకటనకర్తలు మన్నింతురుగాక! నేను 1910 సం॥లో కవిత్వము ప్రారంభించితిని. ఇప్పటికి 15 సంవత్సరములు అయినది. కవిత్వానుభవము మాటయెట్టున్నను- కాపీరైటు అమ్మువిషయములో నాకు మంచి అనుభవమున్నదనియే నాయభిప్రాయము-వేయిరూప్యముల మొత్తమునకు ప్రారంభంబై తుదకు 25 రూపాయలలోఁగూడ దిగినది. ఇందుకునాదరిద్రావస్థయే కారణము. ఇఁకనాటకరచనయందువిసుగు జనించినది. ఓనాటకరచనా! ఇఁకనన్నువిడిచి, బాలకవులనాశ్రయింపుము-భారతీ! నాబుద్ధినిఁక భాగవత భారత టీకారచనయందుఁ బ్రవేశపెట్టి కీర్తిఁదెమ్ము.

ఈగ్రంథమును ముద్రింపించి నాకు కీర్తిదెచ్చిన శ్రీగోవిందముగారికి, నిఖిల శుభములు- సత్కీర్తినిఁ దెచ్చుగాక! శ్రీయుతులాచంద్రార్క తారావనిశరధి స్థాయిగ పుత్రపౌత్రధన సంపూర్తిని వర్ధిల్లెదరుగాక.!

ఇట్లు,

గ్రంథకర్త.

మంజులనైషధము అను

# చిత్రనళీయము

## ప్రస్తావన.

శ్రీలలితాంగి నంకతల । సీమను దాల్చి, దరస్మితప్రభా
క్షాళితతత్కపోలఫల । క ప్రతిబింబితకుండలాంకురిం
ఛోళిదళన్ముఖచ్ఛవిత । శోభిలుచున్న మురారి సభ్యులన్
దేలుచుఁగాత సంతత ము । దీర్ణకృపారస ముప్పతిల్లఁగన్.

మ॥ నతసర్వామరమూర్ధభాఙ్మకుటసం । తానంబునన్ వేనికాం
తితతుల్ పంకజరాగకందళములై । దీపించుచుం డెవ్వి నం
స్తుత నానాముని మానసాంతరగృహ । స్తోమంబునన్ దివ్వెలై
సతతంబింపగునట్టి మాధవు పదా । బ్జంబుల్ మిమ్ముఁ బ్రోచుతన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి) ఓహో ! సభ్యులు నాకొఱకు నిరీక్షించుచున్నారు కాబోలు. కాలహరణమొనర్చి వీరికి శ్రమ యిచ్చితినిగదా ? ఇఁకనైనేఁదొందరపడవలయును. (ప్రక్కఁజూచి) పారిపార్శ్వకా! నీవొకసారి యిటురమ్మా?

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఆర్యా ! ఏమిసెలవు.

సూత్ర—ఏమిసెలవనియడుగుచుంటివా ? విషయగ్రహణశక్తి నీయొద్ద లేశమైనను లేదుకదా ! చూడుము. నాటకశాలయంతయు నెట్లు సభ్యులతో నిండియున్నదో ? వీరిరాకకుఁగారణ మేమని యూహించెదవు ?

పారి—తెలిసినది తెలిసినది. నాటకప్రదర్శనసందర్శన కుతూహలాయత్తచిత్తులై వచ్చినవారేకదా ?

సూత్ర—ఇఁక నేమి ! అన్నివిషయములు తెలిసియుండియు, మధ్య మధ్య మఱచిపోవుచుందువు.

పారి—ఇప్పుడు మనము ప్రదర్శింపఁదలఁచిన నాటకమెద్ది ?

సూత్ర—మంజులనైషధమను నామాంతరముగల చిత్రనళీయనాటకము.

పారి—(ఆలోచించుచున్నాఁడు)

సూత్ర—ఆలోచించుచున్నాఁడవేమి ?

పారి—చిత్రనళీయమనుపేరిదివఱకు వినియేయున్నాను, కాని దానికి మంజుల నైషధమను నామాంతరము మాత్రము వినలేదు.

సూత్ర—నీవిదివఱకు విన్న చిత్రనళీయమునకుఁ గర్త, ఆంధ్రనాటక పితామహులగు ధర్మవరం రామకృష్ణమాచార్యులవారు. ప్రస్తుతము మనము ప్రదర్శింపఁదలఁచిన నాటకమునకుఁ గర్త మఱియొకరు.

పారి—(నవ్వును)

సూత్ర—నవ్వుచుంటివేమి ?

పారి—ఇదియొక చిత్రనళీయమన్న నవ్వువచ్చుచున్నది. సుప్రసిద్ధకవిశేఖరుఁడును, ఆంధ్రనాటకపితామహుఁడుననగు కృష్ణమాచార్యులవారిచే రచియింపఁబడి ప్రతినాటకసమాజముచేఁ బ్రదర్శింపఁబడి, పేరుఁగొన్న చిత్రనళీయముండగా మరల నిదియొక చిత్రనళీయమా ! అయ్యా ! దీనికిఁ గర్త యెవరు ?

సూత్ర—శ్రీమన్మధ్వకులసంజాతుఁడును, ద్రోణమరాజ వంశక్షీరపాథోరాశిపూర్ణ సుధాకరుఁడును, నారాయణరాయతనూభవుఁడును; శ్రీమత్కవికంఠీరవ కింకపీంద్రఘటాపంచానన విద్వత్కవిబాలకలానిధి, బాలసరస్వతి శతావధానేత్యాదిబిరుదావళీవిరాజమాన శ్రీతిరుపతి వేంకటేశ్వరకవీంద్ర ప్రియశిష్యుఁడును ననేక ధరాపురందరసమర్పిత బహువిధ సత్కారవిలసితుఁడును, శతాధికగ్రంథకర్తయునగు సీతారామకవి దీనికిఁ గర్త. ఈతఁడీనాటకమును రచించి, నిత్యసత్యవ్రతధుర్యతావర్యాయ హరిశ్చంద్రుఁడును, నాశ్రితజనసముదయత్రాణపరాయణుఁడును, యాచకజనచకోరచంద్రుఁడును, నిరంతరవిద్వద్గోష్ఠీతత్పరుఁడును, నిరర్గళకవిత్వచమత్కారపారీణకవిగ్రామణి సమర్పితహృద్యానవద్య పద్యగద్యనిబంధనానుబంధ బంధురప్రబంధుఁడును, శరణాగతరక్షణ దీక్షానిర్లక్షితాంబుజాక్షుఁడును, నిరుపమకరుణారససాగరుఁడును, నిరంతరశ్రీమద్రమానాథపరమపవిత్రచరణారవింద నిష్యందితామందమకరందరసాస్వాదనామోదసుఖోన్మత్తచిత్తమధువ్రతుఁడును; కంకులవంశకలశవారాసికైరవహితుఁడును,నగు గోవిందపరమపావననామునకుఁ గృతినొసంగెను.

పారి—కావ్యకర్తయుఁ గృతికర్తయు యశోవిరాజితులే. కాని యొక్కవిషయము మాత్రమడుగవలసియున్నది. ఇదివఱకు సుప్రసిద్ధమైన నాటకమును మరల నీగ్రంథకర్తయేల రచియించెను?

సూత్ర—దానికంటెమిన్నగఁ జేయవలయునని తలంపునసితఁడు వ్రాయలేదు; ఈకథయందాతనికున్న యభిలాషయే రచనమునకుఁ గారణము.

పారి—అట్లయిన నీతఁడీనాటకమును రచించి, లోకమునఁ గృతార్థుఁడేయగునో, పరిహాసపాత్రుఁడేయగునో మనము చూడవలయును.

సూత్ర—అది నిర్ణయించుటకు రసగ్రహణపారీణులుండిరికదా? (ఇంచుకయూరకుండి) ఇప్పుడు మనకీ సంశయముతో నేమిపనియున్నది.

మ॥ కతయా శ్రీనళసార్వభౌముకతయే । కర్తా యగణ్యుండు, మే
ల్చతురుల్ నర్తకులున్ సభాజనములా । శాస్త్రజ్ఞులున్ బండితుల్
గృతికర్యాధవుఁడా తలంపకను స । త్కీర్తిప్రతాపాఢ్యుఁడీ
గతిఁజేకూరె సమస్తమొక్కయెడ నిం । కన్ సంశయంబేటికిన్.

రమ్ము ప్రదర్శనమున కుపక్రమింతము. (ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



మంజులనైషధము అను

# చిత్రనళీయము.

## ప్రథమాంకము

రంగము:—[నిషధపురమున సభాభవనములో నళుఁడు ప్రవేశము.]

నళు—(తనలో) నిశ్చయముగా నాదమయంతి సౌందర్య మద్వితీయమైనది. బ్రహ్మ యయ్యాలివేణీ జనచూళికాభరణాను నవీనముగ సృష్టించినాఁడు. సౌందర్యరసాధిదేవత యామెయందు మూర్తీభవించినది. లావణ్యస్రవంతి ప్రవహించుచున్నది.

మ॥ అమరస్త్రీతతులన్ గణింప దురగ । శ్యామాతతిన్ మెచ్చ, ను
త్తమవిద్యాధరకాంతలన్ దెగడు, సి । ద్ధస్త్రీల నగ్గింప వా
రమణీరత్నము నిస్తులాకృతిని గో । త్రామధ్యమందామె జ
న్మమునన్ ధన్యతఁగన్న భీమనృపునె । న్నంగా వలెన్ నామదిన్.

(చిత్రపటమును జూచి) చిత్రపటమునందే యింత సౌందర్యముపొడగట్టుచున్నది. ఆబింబాధరి దివ్యమంగళవిగ్రహము మఱింత సౌందర్యముగనుండును గదా ? సుదేవుఁడామె సౌందర్యమునుగూర్చి చెప్పినదిమొదలు నాచిత్తమంతయు నత్తలోదరియందనే లగ్నమైనది. అయ్యాలివేణి నాకు రాణియగుభాగ్యంబుండునే ! (ఆలోచించి) ఏమో ! యూహింపఁజాల.

మ॥ పతిలోకంబున కెల్లమానికమునై । సౌందర్యరూపంబునం
దతివిఖ్యాతినిఁగాంచి చెన్నలరు నా । యబ్జాతపత్రాక్షి; యే

ప్రీతముల్ జేసితినంచు నాకు సతియై । భాసిల్లగానెంచు, నీ
కుతుకం బేటికిఁ జెందఁగా ! యవికదా । గొంతెమ్మకోర్కల్ భువిన్

(విశారదుఁడు ప్రవేశించును)

నళు—విశారదా ! వచ్చితివా ? భీమరాజపురోహితుఁడగు సుదేవునిఁ బంపివచ్చితివా ? నేను చెప్పినచందముననే యాతనిని సత్కరించితివి కదా ? ఆతఁడు సంతసించెనా ?

విశా—దేవా ! ఆవంతయుఁగొఱంతలేదు. మనసత్కారమునుబొంది యాతఁడందిన యానందమునకు మేరలేదు. (ఇంచుకయూరకుండి) మహారాజా ! నీవు దీర్ఘాలోచనతత్పరుఁడవైయున్నవిధము దోచుచున్నది. సుదేవునితో మాటలాడిన మొదలు మొగము కొంచెము మారినది. కారణము నేను వినఁదగుదునేని సెలవీయఁగోరెద.

నళు—విశారదా ! దీర్ఘాలోచన మేమియు లేదు.

మ॥ ధరణీభారము నిర్వహించు నతఁడా । త్మక్షోణిలో నందఱిన్
కరుణాయత్తమనంబుతో నరయుచున్ । గాపాడుటల్ మాని, ని
ష్కరుణన్ రాజ్యమదాంధవృత్తిఁ బ్రజలన్ । గారింపఁగాఁజెల్ల, ద
క్కరణిన్ జేసిన ధర్మహానియుఁ దిర । స్కారంబుగానుండునే.

విశా—ఇప్పుడట్టిదేమి కలిగినది ?

నళు—పుష్కరుని చింతలేదా ?

తే॥గీ॥ సద్యశోతరుణికిని నా । స్థానమైన
చంద్రవంశమునందుఁ బు । ష్కరుఁడుపుట్టి
నిజకులాచార ధర్మంబు । నేలఁ గలపఁ
దులసివనమున గంజాయి । మొలకవోలె,

సేవ—(ప్రవేశించి) సార్వభౌమా ! కొందఱు పౌరులు తమదర్శనార్థమై వేచియున్నారు.

నళు—నిరాటంకముగలోనికిఁ బ్రవేశపెట్టుము. ఏమికష్టసుఖములఁ జెప్పుకొనఁదలఁచి వచ్చిరో.

[ప్రవేశము నలుగురుపౌరులు]

(అనుబంధము 1

పౌరులు—రాజేంద్రా ! జయము జయము.



నళు— తే॥గీ॥ కుశలమా మీకుఁ జెప్పుఁడీ । విశదముగను
జరుగుబాటుకులోపంబు । జరుగకుండ
గడచుచున్నవె దినములు । కడుసుఖముగఁ
బౌరులార । సుస్థిరమహో ! దారులార !

పౌరు—స్వామీ! మాబ్రతుకు "దినదినగండము వేయియేండ్లాయువు" అన్నట్లున్నది.

నళు— తే॥గీ॥ అకట ! యిదియేమి పౌరులా । రా !

పౌరు— నృపాల ! పుష్కరుని బాధ భరియింపఁ । బుడమియందు
వశముగాకున్నదయ్య,

నళు— ని. । ర్భయముగాని! చెప్పుడీవారు

పౌరు— నేమంచు । జెప్పఁగలము.

మొదటి పౌరుఁడు—మహాప్రభూ ! మేము పురమున నిలువలేకయున్నాము..

రెం—పౌ—ఆలుబిడ్డలతో నెక్కడికైనఁబొమ్మని యాజ్ఞనిచ్చినచోఁ బోయెదము.

మూ-పౌ— తే. గీ. తనసుతుండు, రాలేదంచు । ద్వారతలము
నందు నిల్చిజూచెడునాడు । యతివనరసి
రాత్రి యరుదెంతు వేయుంచు । రాజచంద్ర
పలికెనఁట పుష్కరుండిట్టి । భంగతగునె.

నళ—హరిహరీ ! ఎంతమాటపలికెను !

నా-పౌ— తే. గీ. పట్టెనామంబులేటికి । బెట్టినావు
మోముపైనను నీరీతి । మూర్ఖయనుచుఁ
బైనఁబడి నాల్కకోన్నాకెఁ । బార్థివేంద్ర
కాంచలేదిట్టి నరపాలు । క్ష్మాతలమున.

ము-పౌ— తే. గీ. బిందెతో నీరుఁగొనిరాగ । వెడలినట్టి
నాదుసోదరిన్ మార్గంబు । నందుజూచి
పైఁబడఁగ నుద్యమించెను । బాపమతిని
భయముచేతను నయ్యింతి । పాఱివచ్చె.

రెం-పౌ—మహారాజా! నాపూర్వులనుండియు మాయింటిపురుషులు మీసములు పెంచుకొనునాచారముకలదు. అందుచేత నేనుకూడ మీసములు పెంచుకొ

న్నాను. నేటిదినమున నెవ్వరో పెద్దమనుష్యులు వచ్చిరిగదాయని యరుగుపైఁగూర్చుండి మాటలాడుచుండఁగా మీపుష్కరుండచ్చోటకరుదెంచి, "రోషములేని మీసములు నీకేలరా" యని బలవంతముగ నన్నుఁబట్టుకొని మంగలినిఁ బిలిపించి గొఱిగించినాఁడు-స్వామీ! ఇఁక మేము నగరమున నుండలేము. కంచెయే చేనుమేసినఁ జేయఁగలిగిన కార్యమేమియున్నది. మీతమ్ముఁడు గావున మీరేమియుఁ బలుకరు. పోనిండు దేవా! మేము మాదారినిఁ బోయెదము. మీరును దమ్ముఁడును సుఖముగనుండుఁడు.

నళ—పౌరులారా! మీరు విచారింపవలదు.

మ. మదియందున్ గృపఁబూని మిమ్ములను సం । భావింపకారీతి, దు
ర్మదుఁడై హింసలఁబెట్టు పాతకిని ను । గ్రక్రోధినిన్ బాపినిన్
సదసత్సంగవిహీనుఁ బుష్కరుని శి । క్షంజేయుచున్ మీదు యా
పదలన్ బాపెద సోదరుండను గృపా । వారాసి నింకింపుచున్.

పౌర—దేవా! ఏమిసేయుదువో-అన్నిటికిని నీవెయున్నావు. పుష్కరుని యనుచరులందఱును నట్టివారే. అందులో దేవలుఁడను బ్రాహ్మణుఁడు ముఖ్యుఁడు. జన్మమున కాతఁడు బ్రాహ్మణుఁడే కాని గుణములకుమాత్రము కటికవాఁడు. అతఁడెట్లుచెప్పిన నట్లుపుష్కరుండు సేయును. వానిమదముగూడ నడఁగవలయును. అయ్యా! మేము మీబిడ్డలము.

నళు—పౌరులారా! ఇఁక మీరు విచార ముడిగిపొండు.

పౌర—చిత్తము-(నిష్క్రమింతురు)

నళు—మంత్రివిశారదా! ఎంతవఱకు నేనీపుష్కరుని సైరించియుండఁగలను? ఇఁక శాంతము వహించినందువలనఁ బ్రయోజనము లేదు. కావున నాయాజ్ఞగా నాతనితో నగరమును వెడలిపొమ్మని తెలుపుము. విదిశాపురము నివాసముగా జేసికొనుమని పలుకుము.

(నిష్క్రమింతురు)

రంగము. (విదర్భలో భీమరాజాస్థానము-భీమరాజు-మంత్రియుఁ బ్రవేశము)

భీమ—మంత్రీ! నాతనూజయగు దమయంతి పరితాపమునకు నేనేమని విచారింతును.



చ. నిలచినఁగూరుచున్న శయ । నించిన మేల్కనియున్న నన్నులన్
గలసిచరించుచుండిన ను । కర్తుకయుండిన, నెద్దియేనియున్
పలుపుచునున్నమానినను । స్వాంతమునందు మదీయపుత్రియా
నలనృపచంద్రునెన్నుచు ఘ । నంబగు తాపమునొందుచక్కటా.

చ. చెలులతో మేల్విహారమును । సల్పగఁబోదు వనంబులందుఁ, బూ
వుల ధరియింపదాజడను । బొందుగ; ప్రేమను బల్కరింపఁగాఁ
బలుకదు తల్లితోనయిన । భావమెఱుంగఁగఁ జేయఁబోదు దు
వ్వాలువలుగట్టదాయతివ । పార్థివుఁడా నలుపై విరాళిచేన్.

ఆమెపరితాపముఁ జూచినకొలఁది నాకును పరితాపము హెచ్చుచున్నది. ఇంతవఱకును నళునిసన్నిధికరిగిన సుదేవుఁడు రాలేదు.

మంత్రి—దేవా! నీవుగూడ నీవిషయమున విచారనీరధిని మునిఁగిన నేనేమని చెప్పఁగలను, కార్యమును జక్కపెట్టుట కా సుదేవుఁడరిగెనుగదా? అతఁడరిగిన కార్యము మఱియొక విధమున నెప్పుడును జరుగదు.

భీమ—సుదేవుఁడట్టి సమర్థుఁడని యెఱుఁగుదును. కాని, చిత్తమున శంకమాత్రము విడువకయున్నది.

మంత్రి—రాజేంద్రా! దేనికిశంక?

భీమ- తే. గీ. చక్రవర్తియుతండు, రా । జన్యవరుఁడ
నేను; నాకుజామాతయై । నెగడఁదలఁచు
బూనునో లేదొయంచును । మానసమున
శంక వొడముచునున్నది । సచ్చరిత్ర.

మంత్రి—అయ్యా! అట్టిశంకతో నవసరములేదు. భవత్తనూజారత్నమును గ్రహించుటకు శ్రీహరియైనను నంగీకరించును-(ఎదుటఁజూచి) అదిగో-సుదేవుఁడు వచ్చుచున్నాఁడు.

(సుదేవుఁడు-ప్రవేశము)

భీమ, మంత్రి— ధరామరవంశభూషణా! నమస్కారములు-

భీమ—అయ్యా! ఈపీఠమున నాసీనుఁడవుఁగమ్ము.

సుదేవుఁడు—(ఆసీనుఁడగును)

భీమ—సుదేవా! నీవరిగిన కార్యము ఫలించినదా ?

సుదే—రాజేంద్రా! నీయభీష్టమునకు భంగమెప్పుడును పొదవదు. నేను నిషధకుఁబోయి యానళసార్వభౌముని జూచి, మార్గవశమున నిట్లు సందర్శింపఁదలఁచి వచ్చితినని పలికి, మనదమయంతి సౌందర్యము ననేకవిధములఁ బొగడి, యామె చిత్రపటమాతనికొసఁగి మోహము దయింపఁజేసితిని. మహారాజా! వేయేటికి! నీవు స్వయంవరము చాటఁబంచితివేని యాతఁడు తప్పక వచ్చి దమయంతిని గైకొనును. ఆనలసార్వభౌముఁడు నీకల్లుఁడగుట పూర్వపుణ్యవిశేషమని తలంపవలయును. భూమండలంబునఁగల మండలాధీశ్వరుల నెల్లరఁ దిలకించితిఁగాని, యట్టియఖండసద్గుణవంతుని, రూపనిర్జితమారుని, నెందునుఁగాంచియుండలేదు

కం. మనదమయంతికినలుఁడును
ననఘుండగునలునకు దమ । యంతియు భళిరా
ఘనముగ నొప్పుచునుందురు
వనజాక్షుఁడు లక్ష్మియట్లు । పార్థివచంద్రా.

సీ. తనభుజార్గళధగ । ద్ధగితాసిరణరంగ
విజయేందిరకుఁ జారు । వేణిగాఁగ
దనదివ్యకీర్తి ది । గ్వనజాతముఖులకుఁ
బాటీరగంధ లే । పంబుగాఁగ
దనయసమాన ప్ర । తాపంబు శత్రు ప్ర
కరమునకును భయం । కరముగాఁగ
దనదానధర్మముల్ । దారిద్ర్యపీడితా
త్మకుల పాలిఁటికల్ప । తరువుగాఁగ

తే. గీ. నవనిఁ బాలించు, వివిధ ది । గంతరాళ
కైతవ విశాలపేటికా । ఖండవిమల
వితతకర్పూరసము దయా । యితయశోవి
భాసురుండు శ్రీనళనృపా । గ్రేసరుండు.

ఇంక నీవనాలోచనముపంకఁబోక స్వయంవరముఁ జాటఁబంపుము. రమ్ము-

(అందఱునిష్క్రమింతురు)

రంగము:-[భీమపురిముందుబయలు:-ఇంద్రాగ్ని యమవరుణులు, ప్రవేశించుచున్నారు]

ఇంద్రు—దిక్పాలులారా! ఈవిదర్భాపురమెంత మనోహరముగ నున్నదో కంటిరా?



సీ. శిఖరోపరి ప్రతి । ష్ఠిత హిరణ్మయకుంభ
పరిచుంబితోర్ధ్వాండ । పంజరంబు
సన్నిధానన్యస్త । శాతకుంభస్తంభ
సంలక్ష్యమాణ సు । స్యందనంబు
పటహతుత్తుంభబం । భాడిండిమారవా
డంబరావృతదిక్త । టాంబరంబు
కర్పూరమృగమదా । గరుధూపధూమని
ర్భరగంధలహరీసు । రంధరంబు

తే. గీ. సాంద్రితరచంద్రమల్లికా । శకలవప్ర
పరిధిబింబిత పరిసరో । పవనచక్ర
వాళమునునైన యావిద । ర్భపురిసొంపు
గంటిరే మీరు నేడు ది । క్పాలులార.

యము—మహేంద్రా! బహురాజనందన బంధురంబును, విమలాప్సరోవారవిలసితంబును, పరమ భాసురమణీభాసితంబును, భూరిభాస్వర వసుపుంజితంబును మహావిభవాభిరామంబునునై యిప్పురంబు చెన్నొందుచున్నది.

వరు—శచీకళత్రా!

మ. చతురంభోధి పరీతభూమివలయా । జనప్రవనాత్యుత్తమ
ప్రతిభీమక్షమనాథ సద్విదితసా । మ్రాజ్యేందిరాపాదప
ద్మతలాంభోరుహరాగరత్నవిలస । న్మంజీరమౌనాగ, న
ప్రతిశోభన్ విలసిల్లుపీటి కనక । ప్రాకారమీక్షించితే.

[ప్రవేశము - పుష్కరుఁడు దేవలుఁడు]

దేవ—పుష్కరా! నిన్ను దమయంతి తప్పక వరియించునని నేను చెప్పగలను.

పుష్క—ఇదిపట్టి గొంతెమ్మకోరిక.

దేవ—బ్రాహ్మణుఁడనగు నావాక్యము రిత్త కాఁగూడదు. దమయంతి నిన్ను వరించిన పిదప నూతనముగ వేయించిన యుద్యానవనమందే, నూతనముగ వివిధచిత్రగతుల నొక్కమందిరము నిర్మింపవలయును.

పుష్క—ఈకోర్కెలవలనఁ బ్రయోజనమావంతయు లేదు. దమయంతి నళునియందు బద్ధానురాగమై యున్నదఁట.

దేవ—అట్లనా! అదియే నిజమైనచోఁ దరువాతసంగతి యేమగునో నీవ చూచెదవు గాక? రమ్ము - స్వయంవరార్థమై వచ్చిన రాజులనందఱిని జూతము.

(నిష్క్రమింతురు)

ఇంద్రు—సమవర్తీ! ఏదియో రథధ్వానము వినవచ్చుచున్నదే ?

యము—(పరికించి) అదుగో - నళచక్రవర్తి వచ్చుచున్నాఁడు.

ఇంద్రు—ఇతఁడు నిరంతర సత్యవ్రతాచారపారీణుఁడు. మనమీతనిని సత్యవ్రతము పరీక్షింపవలయును.

(నలుఁడు వార్ష్ణేయునితో రథముపైఁ బ్రవేశము)

నలు—వార్ష్ణేయా! నీరథచోదకత్వము నాకెంతయు నద్భుతమును గొలిపినది. రథమారోహించుటయే తడవుగా విదర్భాపురముఁ జేర్చితివి. ఆహా! ఈనగరముయొక్క సౌందర్యము! ప్రాక్సౌధగర్భ దీప్రప్రభాసందర్భశాద్వలి తోర్ధ్వాండసంపుటమును, చంద్రశాలాకులాంచల చంద్రముఖీలా చంద్రికాక్షాళితాశాతటమును, శ్రీకరప్రాసాదశిఖర లక్ష్యాతీత సకలనక్షత్రకక్షాపథమును, గోపురాగ్రలింద కురువిందబృంద మాంగారకీకృతనభస్తారకమును, రసాతలగభీరాంభస్సమాహార పరిఘాహృతార్ణవ ప్రాభవమును, శశికాంతమణికాంతసౌధజాల ప్రభాడంబర క్షాళితాశాంబరమును, బహువిధమణిమందిర విభ్రాజితంబును, వివిధవిచిత్రోద్యానవనారామవిలసితంబును, నైయీనగరమెంత వింతగొలుపుచున్నదో కంటివా?

(అనుబంధము 2)

వార్ష్ణే—సార్వభౌమా! మహేంద్రుని యమరావతీనగరమెట్లుండునో చూడలేదుగాని దీనింజూచినపైన నయ్యది యింతకంటెరమణీయముగ నుండునాయని సంశయముగనున్నది.

నలు—అశ్వములలసియున్నవి. ఇంచుకకాల మీవృక్షము నీడ రథమాపుము.

వార్ష్ణే—(రథముతో నిష్క్రమించును)

ఇంద్రు—నిషధపురాధీశ్వరా! నలసార్వభౌమా!

నలు—ఎవరో నన్నుఁబిలుచుచున్నారే. (దిక్కులు పరికించును) వీరుమహనీయులైన దేవతలవలెఁ జూడఁగట్టుచున్నారు. (ప్రకాశముగా) దశదిశలవెలిగించు నపూర్వతేజమున విరాజిల్లు మీరు బృందారకులవలెనున్నారు. మీకు నేనిదే నమస్కరించుచున్నాను; కరుణించి మీయభిధానంబులఁ దెలుపుఁడు.



ఇంద్రు— తే. గీ. అనలుఁడీతండు, సమవర్తి । యితఁడు; వరుణుఁ
డితఁడు, నిర్జరనాథుండ । నేను; వినుమ
పెక్కుమాటలఁ బనియేమి । పృథ్వినాథ
యర్థులైతిమి నీకడ । కాదరింపు.

యము—చక్రవర్తీ! నీవుజగజ్జన సంస్తుత్యభాషావిశేషవైదుష్యధురంధరుండవనియు, బంధుమిత్రభృత్యామాత్యహితపురోహిత చతుశ్చకోర పూర్ణచంద్రుండవనియు, నవ్యాశాశ్వతైశ్వర్య ధుర్యతావధీర్యమాణశరచ్చంద్రుండవనియు, శిష్టరక్షణ దుష్టశిక్షణ దీక్షావైచక్షణ్యదాక్షిణ్యమూర్తివనియు వినియుంటిమి.

నలు—(తనలో) ఆహా! బృందారకులు నాకడకర్థులై వచ్చిరఁట. ఏమినాభాగ్యము!

సీ. ఇదికదా సుదినంబు । మదిలోన నుండెడు
బహుళ దుఃఖంబుల । బాయఁగంటి
ఇదికదా సుదినంబు । సదమలచరితులౌ
మిమ్ములఁజూచు భా । గ్యమ్ముఁగంటి
ఇదికదా సుదినంబు । విదిత యశంబును
భూచక్రమందునఁ । బొందఁగంటి
ఇదికదా సుదినంబు । తుదిలేని పుణ్యంబు
చేకూఱు మార్గంబుఁ । జెందఁగంటి
తే. గీ. ఇదికదా సుదినంబు మ । హీశవరుల
యందు నలరాజచంద్రుఁడే । యమితకీర్తి
వంతుఁడను మేటిబిరుదంబుఁ । బడయఁగంటి
నమల గుణమూర్తులార! ఓ । యమరులార.

(దేవతులను నొక్కొక్కరినిఁ జూచుచు) మహేంద్రా! చింతామణి - కల్పవృక్షము కామధేనువు మొదలగువానికధీశుఁడవు. విబుధలోకసార్వభౌముఁడవు. ధర్మరాజా! అఖిలప్రాణులను ధర్మాధర్మములెఱిఁగి శిక్షించుచుందువుగాన నిన్ను సమవర్తియనిరి. అగ్నిభట్టారకా! నీవుయజ్ఞమున నందఱికిని శుభములఁ జేకూర్చుచుందువు. ప్రతివస్తువును బవిత్రము సేయుచుందువు. వరుణదేవా! నీవు లోకజీవనదాతవు. ఇట్టిమీరు నన్నర్థింపవచ్చితిమని పలుకుట నాకెంతయు వింతగనున్నది.

ఉ. సూనృత వాక్యదీక్ష కడు । శోభవహింపఁగ మీదుకోరికన్
మానక తీర్చువాఁడ నను । మానము లేక వచింపుఁడయ్య నా

ప్రాణములైన నిత్తు; మఱి ప్రాణముఁ గంటెను నెక్కుడైన దే
దేని యొసంగువాఁడ నిపుడే! బుధపుంగవులార వేడ్కమై.

ఈ నైషధుఁడు దేవతల సేవకుఁడని యెఱింగి వచింపుఁడు.

ఇంద్రు—వీరసేన కుమారా! నలరాజా! నిత్యసూనృత విభవాభిరాముండవని మే మెఱింగియుండుటచేతనే నీపై నొక కార్యభారముఁ బెట్టఁదలఁచి వచ్చితిమి.

నలు—దిక్పాలులారా! మీరు సంశయింపక తెల్పుఁడు. ఈతఁడు మీ యాజ్ఞఁ దీర్పుట కొఱకెప్పుడును సంసిద్ధుఁడే యని తలంచి మీ మొదల నే నేమి చేయవలయునో వచింపుఁడు.

ఇంద్రు—ఓ మిహిరాంశువంశకలశోదధిచంద్రా! మే మందఱమును దమయంతీ స్వయంవరార్థమై యరుదెంచినాము.

నలు—(ఆలోచించుచు) దేవతాగ్రమణులగు వీరికిఁగూడ మానవాంగనయగు దమయంతిపై భ్రాంతిపోయుఁదా యేమి?

ఇంద్రు—రాజా! ఆలోచించుచున్నావేమి?

నలు—అమరులారా! ఏమియును లేదు. చెప్పుఁడు.

ఇంద్రు—కావున నీ వెట్లయినను దమయంతియొద్దకుఁబోయి మా నలువురిలో నెవ్వరినైనఁ దనయిచ్చవచ్చినవానిని వరింపుమని చెప్పుము. ఈ కార్యభారము నీభుజస్కంధమునందుఁ బెట్టితిమని నీవు మమ్ముఁగూర్చి మఱియొకతీరునఁ దలంపవలదు.

తే. గీ. అమర కార్యంబు నెరవేర్చి యమిత యశముఁ
గాంచుమా పదునాల్గులోకముల వారు
నిత్య సత్య వ్రతుఁడటంచు నిన్నుఁ బొగడ
సద్గుణస్తోమ! ఓనల సార్వభౌమ.

నలు—(తనలో) హా! వీరికిది యెట్టికోరిక!

ఇంద్రు—రాజేంద్రా! మాటాడక యూరకుంటి వేమి?

నలు—అమరులారా! మీ ప్రశ్నకు నే నేమి ప్రత్యుత్తర మిత్తునా యని యాలోచించుచుంటిని. నేనును దమయంతీ కాంతను గైకొనఁదలఁచి తత్స్వయంవరమునకే పోవుచున్నాఁడ. నలుని హృదయముఁ బరీక్షించుటకు మీ రిట్లు పలికియుందురు. కాకున్న దేవతలగు మీకు మానవాంగన కావలయునా?



అగ్ని—నలరాజా! ఈ మాటలతోఁ బని యేమున్నది. చేసిన వాగ్దత్తమును ననుసరించి దేవకార్య మొనర్చి యశము నందుము.

యము—(అగ్నిం జూచి) అనలా! నీ కేమయిన పిచ్చ పట్టినదా యేమి? భూపతులెక్కడ? సత్యాలాపము లెక్కడ? ఆహరిశ్చంద్రునకే చెల్లినది గాని, తక్కిన వారి కెక్కడ! సత్యముఁ దప్పకుండుట యెక్కడ!

వరు—రాజేంద్రా! ఇట్టివాఁడవు ముం దేమని వాగ్దత్తముఁ జేసితివి?

ఇంద్రు—నలరాజా! నీవంటివారు పలికి తప్పరాదు. క్షణభంగురమైన సంసారమున కానఁ జెంది కీర్తియు ధర్మమును వీడువఁదగునే! ఇంతవఱకును నీగుణంబునఁ గళంక మేమియు లేదు. అట్టియెడ నేఁడేల చిరకాలసముపార్జితయశమును గోల్పోవఁజూచెదవు. అర్థులు చింతామణిని, కామధేనువును, గల్పకమును వేఁడి వైఫల్యమును బొందరు. అట్లే నిన్ను యాచించిన మేము మిన్నకయ పోవుదమా!

నలు—పాకశాసనా! నే నెప్పుడును నసత్యమాడువాఁడనుగాను. భూతభవిష్యద్వర్తమానముల నెఱుంగఁజాలిన మీకు నేను చెప్పఁదగినంత సామర్థ్యము కలవాఁడనుగాను. ఇట్టి కార్యమున మీరు నన్ను నియోగించుచుండ, నేను చేయవలసిన దేమున్నది? ఏనును నా భీమరాజపుత్రిని వరింపఁగోరి పోవుచున్నాఁడ. అట్టిచో నిట్టి దౌత్యం బెట్లు సేయుదు? అబలాంగిపైఁ జిత్తము నిల్పియుంచిన నేను మీ రహస్యం బెట్లు రక్షింపఁగలను? నాయందు లగ్నమానసయైన యంభోజాక్షితో మీ ప్రసంగ మెట్లు చేయుదును అనేకవీరభటపరిరక్షితమైన శుద్ధాంత భవన మెట్లు ప్రవేశింపఁగలవాఁడ?

ఇంద్రు—రాజేంద్రా! నీవు చేయఁదలఁచితివేని యిక్కార్యమవలీలఁగాఁ జేయఁగలవు. ఇఁక సంశయింపవలదు: (తిరస్కరిణీఘుటిక నిచ్చును)

నలు—మహాప్రసాదము.

అగ్ని—మహేంద్రా! ఇఁక మన మరుగుదము రమ్ము. (ఇంద్రాదులు నిష్క్రమింతురు)

నలు—(తనలో) అక్కటా! ఇప్పుడు నే నేమి చేయుదును? ఇంద్రాదులకుఁ గూడ దమయంతిపై భ్రాంతి జనించెనే! జనించుఁగాక! ఈ దౌత్యమునకు నన్నే వారేల నియోగింపవలయును? పాకశాసనా!

సీ. ధన్యసంప్రాప్తను ధర్మసింహాసనా
స్థానభాగ్య గరిమ చాలలేదొ

నవకల్ప భాసిత । నందనానంద ని
శ్చల విహారసుఖంబు । చాలలేదొ
రమణీయనిర్మల । ప్రీతిభాధురీణ ది
క్పాల సంసేవలు । చాలలేదొ
ఐరావతోచ్చైశ్శ్ర । వాదిసద్వాహన
స్వర్గసంచారముల్ । చాలలేదొ
తే. గీ. దివ్య చింతామణి కామ । ధేనుపారి
జాత ఘనవైభవంబులు । చాలలేదొ
అకట! దమయంతి పైబెట్టి । యాశయేల
నిఖిల సద్గుణసాంద్రు డౌ । నిర్జరేంద్రు.

(ఇంచుక యూరకుండి) అక్కటా! ఇదియేమి! ఇంద్రుని నిందించుచున్నాను. (దమయంతినుద్దేశించి) హా! దమయంతీ! విదర్భరాజతనయా!

మ. వనజాక్షీ! నినుఁ గాంతఁగాఁగొనుచు దీ । వ్యద్భోగ వారాసి మ
జ్జన మాడందలపోసి యుండఁగను నీ । చందంబు ప్రాప్తించె నే
మనువాడన్ విధి నక్కటా సురలె యు । ద్యద్భ[illegible] నిన్ గోర నా
కనుమోదంబు ఘటిల్లుటెట్టులిఁక నే । లావణ్యరూపం[illegible]కల్;

దమయంతీ! నన్ను వరించుటకు నిష్టపడుచున్న నీవిఁక పాకశాసనుని వరించు[illegible]పాలు. దమయంతిపైనున్న మోహమా! నన్ను విడచిపొమ్ము. [illegible] నైషధుని ధనము కాదు. ఎంత సరిపుచ్చుకొన్నను దమయంతిపై నున్నయనురాగము నన్ను విడువక యున్నది.

మ. ఘన సత్యవ్రత రత్నహారమయి య । క్క[illegible]పైనున్న నా
యనురాగంబుఁ ద్యజింతుఁగాక నను బెం । డ్లాడం[illegible]ను నా
వనితా గోమల పద్మపత్రి నయనన్ । వైదర్భి నే నె[illegible]
మనసుం దా యభిమానముల్ విడిచి సం । ధానంబు గావింతునే?

అక్కటా! ఏప[illegible]తీకాంతపై కాలంభ్రాంతి కలిగె. కలుగుఁగాక! ఆమెకుఁగూడ నాయందేలమోహ ముదయింపవలయును? ఈదేవతలు నన్నే యీకార్యమునందేల నియమింపవలయును? భువన మోహన శృంగార లావణ్యరసాధిదేవతయగు దమయంతి; అ[illegible]లిలా జనమౌళి కాభరణయగు దమయంతి; నలునకర్ధాంగియగునని తలం



పఁబడిన యర్ధాంగి; దేవేంద్రుని వరించునా? ఈకార్యమునకు సంధానకర్త నలుఁడా! (యించుక యాలోచించి) నేనిది యంతయు విచారించుచు దేవకార్యమును మఱచితిని. (చిత్రపటమును జూచుచు) ఇఁక నాకీచిత్రపటమే దమయంతి.

(అనుబంధము 3)

మ. ఇదివారీ జనమౌళికాభరణ మీ । హేమాంగియే నైషధున్
ముదమొప్పన్ వరియింపఁగాఁ దలఁచు న । మ్ముగ్ధేందు బింబాస్య; యి
య్యదె భీమక్షితిపాలశేఖరుని భా । గ్యశ్రేణి; బృందారకుల్
మది వాంఛించిన దీ నళీమణియె యే । లా చింతిలన్ నాకిఁకన్.

ఇఁక నేను దేవకార్యమునందుఁ బ్రవేశించెదనుగాక!

(తెరలో)

నలరాజా! నలరాజా!

నలు—ఎవరు వారు! (పరికించి) ఓహో! బృందారకులా! మహాత్ములారా! ఏమి యాజ్ఞ.

(తెరలో)

దమయంతికి చెప్పవలసిన వాక్యములు మఱచిపోయినాము. వానినిఁగూడ వినిపొమ్ము.

నలు—భాగ్యము. (నిష్క్రమింతురు.)

రంగము— [ దమయంతి యంతఃపురము — (ప్రవేశము — దమయంతి)

(అనుబంధము 4)

దమ—(స్వగతము) అబ్బా! ఈమదనుని దాడి యధికముగ నున్నది.

ఉ. వాలుగడాలు గ్రాలుసుక । వాహనమున్ దుమికించుచున్ రహిన్
బాలసమీరచైత్రు లిరు । పార్శ్వములన్ భజియింపఁగేకిహం
సాళిపికధ్వజిస్య విర । [illegible]పాటిల నాత్మకార్ముక
జ్యాలతికన్ శితాస్త్ర నివ । హంబును మన్మథుఁడేయు నీసునన్

మ. జననాథుండగు నైషధుండిటకుఁ దా । జన్దెంచునో లేదొ వ
చ్చిననున్ జూచును చూడఁడో తలఁచునో । చిత్తంబునందెంచఁడో
యను కంపామతి నన్ గ్రహించుటకు నా । హ్లాదించునో లేదొ యా
ఘనగారీపతి సత్కృపన్ గనుదు భా । గ్యప్రాప్తి యెట్లుండునో.

(ప్రవేశము — భారతి - నర్మద)

భార — దమయంతీ! దమయంతీ! (చూచి) ఇదియేమి? విచారగ్రస్తవై యిచ్చటఁగూర్చున్నావు. నేఁడు స్వయంవరమన్న సంగతి మఱచిపోయితివా యేమి?

నర్మ — ఎవరి పెండ్లిసంగతి వారు మఱచిపోవుదురా యేమి? (ఇంచుక యూరకుండి) అవునవును. నలుని పైభ్రాంతి దమయంతి నట్లు చేసెనేమో?

దమ — చెలులారా! ఈమాటలేటికి? నాకట్టిభ్రాంతి యేమియు లేదు.

భార — భ్రాంతి లేకేమి! నీమొగమే చెప్పుచున్నది. నేఁడేగదా స్వయంవరము. ఇంతలో తొందరయేల? ఇన్నిదినములోర్చుకొన్న దానవు నేఁటికోర్చుకొనలేవా? నేఁడు తప్పక నలునిఁజూడఁగలవు.

దమ — భారతీ! నాతోడ నీ పరిహాసమేల చేసెదవు. (ఆయాసము నటించును) ఉష్ - అబ్బా!

నర్మ — నలుని మాటఁజెప్పిన నీమె కెట్లు సంతాపము కలిగినదో కంటివా?

భార — నీకుఁగూడ నేమైన గలిగినదా యేమి?

దమ — (శరీరముఁ గంపింపఁజేయుచు) అబ్బా! నాశరీరము కంపమెత్తుచున్నది.

భార — ఆకంపమునకు దివ్యౌషధము నలుని రాకయె!

దమ — (మరల వణకును)

నర్మ — భారతీ! ఏమే యిట్లు వణకుచున్నది?

భార — (భారతి చేయిపట్టుకొని చూచి) నర్మదా! నర్మదా! నిజముగనే దేహము కంపమందుచున్నదే. కంపమందుటయే కాదు. శరీరము మిగుల వేడిగనున్నది.

నర్మ — ఇదియొకవిధమయిన తాపజ్వరము.

దమ — అబ్బా! (మూర్ఛిల్లుచున్నది)

నర్మ — అయ్యో! ఈమె మూర్ఛిల్లినదే. శీతలోపచారములను జేయుదము.

(ఇద్దరును దమయంతికి విసరుచున్నారు.)

దమ — (మూర్ఛ దెలిసి) సఖులారా! నాతో నిప్పుడు మాటలాడి యరిగిన వారెవ్వరు?

భార — నీతో మాటలాడిన వారెవరు? ఇచ్చటనున్న వారము మేమేకదా?

దమ — అబ్బా! మీరుకాదే! ఎవ్వరో పురుషుఁడే.



భార — నలుని రూపు నిరంతరము నీకన్నులయెదుటను మనంబున నుత్ప్రేక్షింపఁబడి యుండుటచేత నాతఁడే యనుకొంటివి కాఁబోలు?

దమ —

చ॥ ఇఁక భరియింపఁజాలఁ దరు । ణీ ఘనతాపము చిత్తమంతయున్
వికలతఁ జెందె నైషధుఁడు । వేడ్కలరారఁగ వచ్చువాఁడ కా
యక యసువుల్ శరీరము న । యంబుగ వ్రాఁకి నుండునంచు నో
సకియరొ యెంచఁజాల జల । జాక్షుఁడు మారుని దాడికోడుటన్

నెచ్చెలులారా! ఇఁక నాదేహమునఁ బ్రాణములు నిలువవు. నాయెడలఁ గరుణించి మీరైనను నిషధపురంబునకుఁ బోయి, దివ్యమంగళమూర్తి; ఆశ్రితజనరక్షాబద్ధకంకణుఁడు; సామంతరాజన్యకిరీటరత్నరుచిదీపిత పాదసరోజుఁడు అగు నలసార్వభౌమునిఁ గాంచి; — అయ్యో! చెల్మికత్తెలారా! మీరు వినుచుంటిరా? లేదా? వినుఁడు - నా భక్తిపూర్వకసాష్టాంగనమస్కారములాచరించి, - భువనమోహన స్వరూపుండవగు నీపై మోహముఁగొని యున్న దమయంతి నీకు దేవియై నీచరణసరసీరుహసేవఁ జేసికొని కృతార్థురాలు కాఁదలఁచిన దమయంతి; నీదివ్యస్వరూపమును గన్నుల జూడుటఁ జిత్రించుకొని సర్వకాల సర్వావస్థలయందును నిన్ను స్మరించుచుండు దమయంతి; నీవు సత్వరముగ నరుదెంచి యనుగ్రహింపనిచో విరహతాపానలంబున బ్రగ్గి ప్రాణంబులఁ బరిత్యజించునని చెప్పుఁడు. (అనుబంధము 5)

భార —

తే.గీ॥ కలఁతఁ జెందఁగనేల యీ । కరణి మదిని
నైషధుఁడు నేఁడె యేతెంచి । నాతి నిన్నుఁ
గైకొని ముదంబు జేకూర్పఁ । గాదె; పలుక
భావ్యమే యిట్లమంగళ । వాక్యములను.

చింతిలకమ్మ దుఃఖమును । జేర్పకుమమ్మ యెలుంగు రాయగా
వంతలగుందకమ్మ సరి । వారలు విన్న హసింతురమ్మ భూ
కాంతుఁడు నీదు తండ్రియు న । గన్ గనుమమ్మ నలుండు వచ్చు నీ
స్వాంతమునందు ధైర్యమును । జక్కఁగఁబూనుము నిన్ను వేడెదన్.

(అనుబంధము 6)

దమ — భారతీ! నీవు చెప్పుటకేమి! ఎన్నియైనను జెప్పఁగలవు. నాచిత్తమున ధైర్య

మూగవలదా ? అబ్బా ! నాకు నిద్రవచ్చుచున్నది. (నిద్రనటించును.)

ఘోర—నర్మదా ! ఇట్టిసమయమున నీవిటకు నిద్ర పరమోహకారము.

నర్మ—ఈమె నిద్రలేచునప్పటికి మందిరోద్యానవనమున నుండుపుష్పములను సేకరించుకొని వత్తము రమ్ము. (నిష్క్రమింతురు.)

(నలుఁడు—ప్రవేశించును.)

నలు—(మందిరమునుఁజూచుచు తనలో) ఆహా ! ఏమి ! ఈమందిరరామణీయకత!

సీ॥ స్ఫటిక పాషాణ సో । పాన దీధితులచే
హరినీల ఖచిత కు । డ్యములచేత
పుష్యరాగోపల । స్ఫుటకవాటములచే
లలిత ప్రవాళ దే । హళుల చేత
వాలవాయజ వజ్ర । వాతాయనములచే
పద్మరాగస్తంభ । పంక్తి చేత
విపులాశ్మ గర్భకు । ట్టిమ విటంకములచే
పటుశాత కుంభ కుం । భములచేత
తే॥ గీ॥ తరళ కంపాళలాకా ల । తావితాన
దీధితి స్పర్థి వైజయం । తికలచేత
ధగధగద్దీప దంతపు । త్రికలచేత
మహిమఁ జెలువందె నిమ్మహా । మందిరంబు.

తిరస్కరణిప్రభావంబున నేనీ మందిరమునుఁ బ్రవేశించితిని. సత్వరముగ దమయంతికి సురసందేశమునుఁ దెలిపి యరిగెదఁగాక ! అక్కటా ! నాకైమురులుగొనియున్న కాంతను వేరొకరిని వరింపుమని చెప్పుటకుఁ వచ్చితినిఁగదా ! ఈమెనన్ను నలునిఁగా నెఱింగి, యిట్టి యకార్యము సేయుటకు నీబోటి ధర్మసంధులుం సాహసింతురా ? యని బల్కిన నేనేమని ప్రత్యుత్తరమీయఁగలను ? విధాతృఁడీ నలునిచే నిట్టికార్యముఁ జేయించుచున్నాఁడు ! యిది యేమివెట్టి ! రోటఁ దలఁదూర్చి రోకటిపోటునకుఁ వెఱపనేల ! దేవకార్యార్థినై యింతవఱకుఁవచ్చి యిప్పుడు యోచింపనేల ? దమయంతిపైనున్న మోహమును విడిచివేసెదను. దమయంతిని వివాహమాడుదునన్న కాంక్ష చిత్తమునుండి యవ్వలకుఁ బాఱదోలెద. (ఇంచుక ముందునకునడిచి దమయంతినిఁ జూచి) భళిరా ! ఈరమణి సౌందర్యము !



మ॥ పొరిఁబోసెన్ జూపుల; రంభనూరువుల; హే । మాభిఖ్య శారీర వై
ఖరి; దారన్ నఖర ప్రశస్తి; శశిరే । ఖన్, జెక్కులన్; జిత్రరే
ఖ రహిన్ భ్రూలతికోన్నతిన్; గెలుచు నిం । కన్మానవాబ్జాక్షుల
చ్చరలే యోడఁగ సాటివత్తురె పయో । జాతాస్యకున్ ధారుణిన్.

చిత్రపటమున లిఖియింపఁ బడినదానికంటె వేయిమడుంగుల సౌందర్యమీమె యందున్నది. (అనుబంధము 7)

ఉ॥ మానవతీ లలామకము । చూనుఁగ నెవ్వనికిన్ లభించునో
వానిద భాగ్యవైభవము । వానిద పుణ్యవిశేషమంచు నా
మానసమందు నెంతు నహహా న । విలాసము చేతనొప్పు నీ
మానిని పుణ్యహీనులకు । మానినిగా విలసిల్లఁ బోవునే.
సీ॥ ఉవిద సందర్శన । యోగంబు యోగంబు
మెలఁత విశ్వాసంపు । మేలు మేలు
ప్రమదామణి స్తవ । సమయంబు సమయంబు
బాలామణీగ్రహ । లీల లీల
కాంతా సమన్వితై । కాంతంబు కాంతమం
బుజముఖీ సఖ్యాను । భూతి భూతి
ముగ్ధోపగూహనా । భోగంబు భోగంబు
సేనాప మేత వా । హాళ్యి హాళి
తే॥ గీ॥ సారసాక్షీ కటాక్ష వీ । క్షణము క్షణము
భామినీ నర్మవాక్య సం । ప్రాప్తి ప్రాప్తి
తరుణీనవసంగమంబు సా । ధనము ధనము
ముదితచెంగటి వాసావి । ముక్తి ముక్తి.

ఈయోషామణి దివ్యమంగళవిగ్రహమును జూచుటచేనేను కృతార్థుఁడనైతిని.

తే॥గీ॥ కన్నులున్నందుకు ఫలంబు । గాంచినాఁడ
నోరునొవ్వంగ స్తుతిఁజేయ । నోచినాఁడ
దనివితీఱంగ నొకసారి । తరుణినిపుడు
ముద్దుగొనుచుఁ గృతార్థతఁ । బొందువాఁడ.

(ముద్దుపెట్టుకొనఁ బోయి—యురల కనుకకు వచ్చి)

హా! ఎంతసాహసకార్యము సేయఁ దలంచితిని! ధర్మబంధుఁడగు నలుఁడిట్టి యకృత్యము సేయఁ దగినవాఁడా!

మ॥ కకుబంతాధిప దివ్యరత్నమకుటా । గ్రస్థావనీభూత భీ
తికరోద్దీపిత శాసనుండయిన యా । దేవేంద్రుఁడే భంగి, నీ
చకితాక్షిన్ వరియింపఁగాఁ దలఁచి నన్ । సంప్రీతిఁ బుత్తెంచెనే
నకటా! యావిధినల్పుఁగానగునె మో । హావేశమగ్నుండనై.

దమ—(ఇటునటు కదలుచున్నది)

నలు—ఈమె మేల్కొనుచున్నట్లున్నది.

దమ—నలరాజచంద్రా!

నలు—ఇది యేమి! ఇక్కాంత నన్నుఁ బేర్కొనుచున్నది? నేనువచ్చిన జాడ నెఱింగి గుర్తించెనా యేమి? (ఆలోచించి) కాదు కాదు. కలవరించుచున్నది. కాఁబోలు!

దమ—ఓనలచక్రవర్తీ! స్వయంవరమునకరుదెంచి నన్నుఁ గైకొందువో లేదో!

నలు—ఇక్కాంత నాపై మోహావశమున నిట్లు పలుకుచున్నది. దమయంతీ! నలుని నలునిపైనున్న మోహమును విడనాడుము. ఈనలుఁడు స్వయంవరమునకు వచ్చినను రాకపోయినను ఒక్కటే. నాకలోకసార్వభౌముని పట్టమహిషివి గానున్న నిన్ను నలుఁడెట్లు వరించును?

(భారతి—నర్మద—ప్రవేశించుచున్నారు.)

భార—ఏమే! ఏదో కార్యము మించిపోవుచున్నట్లు పూవులుగోయుచున్న నన్నీడ్చుకొనివచ్చితివి?

నర్మ—యేమీ లేదు, ఒక సంగతి నీతోఁ జెప్పుటకు,

భార—ఆసంగతి యేమి?

నర్మ—ఏమీ లేదు వచ్చినాఁడు!

భార—ఎవరు?

నర్మ—దొంగ.

భార—దొంగయెవరే?

నర్మ—మనదమయంతి హృదయము నపహరించిన దొం

భార—నలుఁడనియా నీయభిప్రాయము?



నర్మ—కాకమఱెవ్వరు?

భార—ఎప్పుడు వచ్చినాఁడు?

నర్మ—ఇంతకుముందే.

నలు—(తనలో) నేను వచ్చినజాడ వీరెఱింగిరా యేమి?

భార—నీవు చూచితివా?

నర్మ—ప్రతివిషయమును జూడవలయునా యేమి? అతని రథ సారథిని జూచివచ్చినానని నవమాలిక చెప్పినది. రథసారథియు, రథమును నున్నప్పుడు నలుఁ డేల యుండకుండును? దమయంతిని మేల్కొలిపి యీవృత్తాంతముఁ జెప్పుదము.

భార—చాలులే! నీ తెలివికి సంతసించినాను. నీ వెప్పుడును నిట్టిపనులే సేయుచుందువు. స్వయంవరమునకు నలుఁడు రాకపోవునా? మన దమయంతిని వరించక పోవునా? రా (ఈడ్చుకొనిపోవును.)

నలు—(తనలో) ఆహా! వీరందఱును దమయంతి నలునే వరించునని నమ్మియున్నారు. దమయంతి కూడ నాయందే చిత్తమునిలిపియున్నది. ఏమిలాభము! ఆమెకును నాకును గడుదూరమైనది.

దమ—(మేల్కాంచి) ఇదియేమి! ఆపురుషుఁడెవ్వరు! నలుఁడని చెప్పి యదృశ్యుఁడయ్యెనే!

నలు—(తనలో) ఈ సతీమణి మేల్కాంచినది. ఈమెను జేరి భాషించుటకిదియే సమయము. (సమీపించి) దమయంతీ! నీకు శుభంబగుఁగాక,

దమ—(తటాలున లేచి కొంచెము వెనుకకేగి) మీరెవ్వరో యెఱుంగవచ్చునా?

నలు—యోషారత్నమా! నేను దేవదూతను. సకలదిక్పాలసందోహకోటీరమణిప్రభాపటల సందీపిత చరణారవిందుండైన దేవేంద్రుఁడు నీకు మందారకుసుమమాల కానుకగా సమర్పింపుమని నుడివె. ఇంద్రాగ్నియమవరుణులు భవత్స్వయంవరమునకరుదెంచి నన్ను నీయెడ కరిగిరమ్మన వచ్చితిని.

దమ—కార్యమెట్టిది?

నలు—చకితాక్షీ! చల్లకువచ్చి ముంతఁ జంకను బెట్టినందువలన లాభమేమైన నుండునా? ఆబృందారకచతుష్టయము నీయందుఁ జిత్తము చేర్చి యందులో నెవ్వరినైనను వరింపుమని చెప్పుటకు నన్ను బంపినారు. చింతామణిపారిజాతోచ్చైశ్శ్రవైరావతాది మహాభాగ్య సమన్వితుఁడగు పాకశాసనుని వరింతు

వా? నిఖిలతేజస్వియు, లోకముల కగ్రగణ్యుఁడును నగు వహ్నిదేవుని వరింతువా? లోకాలోక ధర్మ సంస్థాపన ప్రాగల్భ్య నిధియగు ధర్మరాజును వరింతువా? సప్త పాథోనిధియగు వరుణుని వరింతువా ?

దమ.—ఓయీ! దేవదూతా! వీరభటపరిరక్షితమైన యీ సౌధం బెట్లు ప్రవేశించితివి?

నలు.—దేవతలిచ్చిన తిరస్కరిణీ ప్రభావమున.

దమ.—రాజకన్యకనగు నాతో మీయట్టి వారికిట్టి ప్రశంస తగునే?

నలు.—అలివేణీ! ఆ బృందారకులు నీకటాక్ష మాసించి యుంటిమని నీతోఁ జెప్పమనిరి.

దమ.—అక్కటా! ఇది యేటిమాట. అమరులగు వారెక్కడ! మానవాంగననగు నేనెక్కడ. ఇట్టి వార్తఁ బంపుటకు బృందారకులకు ధర్మమని తోచినదా? అదియుంగాక; నా హృదయమిదివఱకే యొక మహాపురుషునియందు లగ్నమై యున్నది. అతనినిఁ దప్ప నేనన్యుల మొగమెత్తియైనఁ జూడను.

నలు.—అబలా! బృందారకుల సందేశమును నీవంగీకరింపక యుండుట ధర్మము కాదు. ఇటు వినుము. దివిజులయందు భవచ్చంద్రసామృతస్నాన వేళలమై సదృగ్విలాసముఁ జేర్పుము. నేఁ జెప్పెడిచొప్పున కంగీకరించి, నా సందేశమును సఫలము సేయుము. బృందారకులపై భక్తిని మనసునఁ దిరంబుగా నిలిపి కల్యాణ వైభవంబును బొందుము. ఓ విద్యుల్లతాంగీ! సకలభువనముల యందును నాకము కను పూజ్యమైనది. అందులో దివిజులు మహాప్రభావసంపన్నులు. వారిలో శచీకళత్రుఁడగ్రగణ్యుఁడు. అతఁడు నీయందు బద్ధానురాగుఁడై యున్నవాఁడు. ఇందుముఖీ! ఆ బృందారకనాథుని నిరాకరింతువా? అట్టివాఁడు కోరినదే చాలుకదా? నందనవనారామసీమలందు విహరింప నీకుఁ గాంక్షలేదా? మందాకినీ తీరస్థ పాంసు సైకత ప్రదేశములఁ గ్రీడ సల్పుట నీకుఁ బ్రియము కాదా? క్షీరసాగరకన్య తోడికోడలై యుండుట నీకు ఘనము కాదా? మూఁడు లోకములవారు నీకు మ్రొక్కుట గౌరవము కాదా? ఇఁకఁ బలుమాటలేల ఇంద్రుని వరించి విమలయశమందుము ?

దమ.—బృందారక సందేశహరా ! అమరాంగనాశోభితుండైన మహేంద్రునకు మానుషీ పరిచయమేల? నిర్జరేంద్రునకు నెనర్హనా! నే నాతనినిఁ గామింతునా? హస్తిహారిణినిఁ గామించునా? అఖిలలోకాధీశుఁడైన యమరేంద్రుఁడె



క్కడ! నేనెక్కడ! అట్టివాఁడు మర్త్యాంగనపై భ్రాంతిఁగొని యుండెనని తెలివ్వరైన విన్న నవ్వుదురు. నే నాతనిని వరింపను. సురేశ్వరుఁడైన నేమి హరియైన నేమి! నా చిత్తము సిద్ధసత్కీర్తియగు నలచక్రవర్తికి వశము చేసితిని. అతఁడే నా మనోనాథుఁడు. నీవీ నా మనోనిశ్చయమును బృందారకుల కెఱింగింపుము.

నలు.—(తనలో) ఆహా! ఈమెకు నాయందెట్టియనురాగమున్నది! ఇఁక నేనీమె కేమని చెప్పఁగలను. (ప్రకాశముగా) జలజాక్షీ! యొకవేళ యానలచక్రవర్తియే నీకడ కరుదెంచి, బృందారకేంద్రుని వరింపుమని వచించినచో నీవేమి సేయుదువు ?

దమ.—దేవదూతా! ఇదేటిమాట. ఇట్టిదెందైన నుండునే. నలుఁడు నన్ను వరింపక యుండిన నుండుఁగాక! ఇతరులను వరింపుమని చెప్పుట కాతఁడవివేకియా?

నలు.—ఒకవేళ యట్లు జరిగిన ?

దమ.—మ. విను మేనిన్ని వచింపనేమిటికి ను । ర్వీనాథుఁడా నైషధేం
ద్రునవశ్యంబు వరింతు నా నృపతి చం । దుండొల్లకే యున్నచో
ననుమానింపక నాదు దేహము నెగిన్ । భక్తిన్ సమర్పింతు నా
తనికిన్ నీటను యగ్నినో యసురులన్ । దధ్యంబుగాఁ బాయుచున్.

నలు.—(తనలో) హా! దమయంతీ! నన్ను వరించుటకెంత దీక్ష వహించితివి; ఇఁక నేను దాచఁజాలను. (ప్రకాశముగా)

మ. పరితాపంబు నడంచు కొమ్ము మదిలో । పాకుప్రచ్ఛున్నాఁడ నా
సురసందేశము మాళిఁ దాల్చి యిపుడి । చ్చో చేరియున్నట్టి యీ
ధరణీశుండు జడుండు పాపమతి యీ । దౌర్భాగ్యుఁడా నైషధుం
డరయఁగ వీఁడె యటంచు నెంచుమిఁక నో । యజ్ఞాతపత్రేక్షణా.

దమ.—(సిగ్గునటించుచు తనలో) హా! నేనెంత మందమతినైతిని. చిత్రపటమునఁ జూచియుండియు నిమ్మహాత్ముని గుర్తింపలేకపోయితినే. (ఎదుటఁ జూచుచు) భారతీ! భారతీ! (నిష్క్రమించును)

నలు.—ఓ రామామణీ! సురసందేశమున కదియే ప్రత్యుత్తరమా? (తనలో) ఈమె పలుకులే బృందారకులకు వినిపించెదఁగాక.

(నిష్క్రమించును)

రంగము—(స్వయంవరమందిరము— ప్రవేశము— ఉచితాసనములపై భీమరాజు
సుదేవుడు; మంత్రి - నలుఁడు - ఇంద్రాగ్నియమవరుణులు (నలరూపములతో) పుష్కరుఁడు - దేవలుఁడు]

భీమ—(సుదేవునిఁజూచి) సుదేవా! నృపాలులందఱును నేతెంచి యుండిరి కదా?

సుదే—అందఱును వచ్చిరి. స్వయంవరసమయము కూడ నాసన్నమైనది.

భీమ—దమయంతి యింకను రాదేమి?

సుదే—అదిగో భారతీపరివృతయై వచ్చుచున్నది.

(దమయంతియు భారతియుఁ బ్రవేశించుచున్నారు)

భీమ—(దమయంతి చేయిపట్టుకొని)

తే. గీ. రావె దమయంతి! నాభాగ్య । రాసి రావె
రావె నోములపంట! చం । ద్రముఖి రావె
పరమమోదమువీద నృ । పాలురందు
నొక్కని వరించి ఘనకీర్తి । నొందుమమ్మ.

ఈ దేశాధీశుల నందఱిని భారతి యెఱుంగును గావున వేర్వేఱుగ జెప్పును.

సుదే—భారతీ! తొందరపడుము.

భార—(దమయంతిచేయిపట్టుకొని)

తే. గీ. వివిధ జలధివేలా పరి । వేల్లితావ
నిఁగల నృపసూనులంగలు । నీ స్వయంవ
రోత్సవమునకుఁజనుదెంచి । యున్నవారు
సుందరీ! నీవు వీరలఁ । జూడుమిపుడు.

చ. కురుమగధాంగ వంగ శక । కోసల పాండ్యకళింగ శాకఘూ
ర్జర మలయాళ సింహళ వ । రాట ముఖాఖిల దేశ మానవే
శ్వరులరుదెంచినారు కడు । సంతస మేర్పడ వేఱు వేఱ భా
సురముగ నీకుఁ జూపెదను । జూచి వరింపుము సారసేక్షణా!

నీ యిచ్చవచ్చినవాని కంఠమునఁ బూలహారము వేయుము.

ఇటురమ్ము. (ఒక్కొక్కరినిఁజూపుచు)

మ. గణనాతీత చమూచ్ఛటా సహితుఁడై । కన్పట్టునప్పార్థివా
గ్రణి శ్రీమంతనునామరాజితుఁడు శా । కద్వీప భూభర్త; భీ



షణ దోస్సారుఁడ నూనసూన కలికా । స్వాంతుం డశేషారిభీ
షణ దత్త ధ్వజనీధవుండనద్యశై । శ్వర్యాభ్యుదయ్జాననా.

దమ—(మూర్ధ్మాగము పెట్టును)

భార— అట్లయిన నిటురమ్ము. (వేఱొకనిం జూపుచు)

చ. అవిరళ వైభవస్ఫురణ । నానరపాలుని ప్రక్క నున్న యా
నవపతి విందనామకుఁ డ । నంత భుజాబలశాలి సింధుదే
శపసుమతీశ్వరుండు; గుణ । శాలి; యసంగసముండు వానితో
తపరలు వారలందఱును । దామరసానన నాని బాంధవుల్.

దమ—(ఊరకుండును)

భార—అట్లయిన నిటురమ్ము. (వేఱొకనిం జూపుచు)

మ. పరివారంబు లనేకముల్ గొలువఁగా । భాసిల్లునమ్మేదినీ
శ్వరుఁడింతీ! మగధక్షమాపతి మహా । సంగ్రామ శూరుండు; దు
స్తర దోర్విక్రమ దంభచంపకమిళిం । దత్సర్వ విద్వేషి భూ
వరుఁడమ్మౌళి భుజ ప్రతాప మహిమల్ । వర్ణింప రాదేరికిన్.

దమ—(ఊరకుండును)

భార—ఇటురమ్ము. (వేఱొకనిం జూపుచు)

కం. ఆభూపాలుప్రక్కన్
శోభిల్లుచు నున్నవాఁడు । శ్రితసేవాఖ్యుం
డాభోగ శౌర్యుఁ డాతఁడు
క్ష్మాభుజ తిలకుండు పద్మ । సన్నిభ నేత్రీ.

దమ—(మూర్ధ్మాగము పెట్టును)

భార—ఇటురమ్ము.

శా. ప్రారజ్యద్ధను రస్త్రహస్తులయి నీ । రంధ్రోన్నతిన్ బల్ చమూ
వారంబుల్ దను గొల్వ నా విభుని కేరి । వర్ద్ధోచువారిద్వరుల్
దోరుద్యద్దృఢ శౌర్య సూర్యకిరణో । ద్ధూతద్విషచ్ఛార్వరుల్
వీరోత్తంసు లవంతి దేశనృపతుల్ । విందాను విందాహ్వయుల్.

దమ—(ముందునకుఁ జూచును)

భార—(పుష్కరునిఁ జూపుచు)

ఉ. ఆజనవర్యు డెంగటను । హా! మోహనీయచమూసమేతుడై
రాజిలు మేటిఘోరరణ । రంగరణద్గుణనాదగర్జన
భ్రాజిధనుర్ఘనోర్జిత శ । రవ్రజ వారిత వైరి దోర్మహా
వ్యాజ దవానలుండు నవ । పద్మదళాక్షిరో పుష్కరుండనన్.

దమ—(మార్గము పెట్టును)

పుష్క—(తనలో) అంతభాగ్యము నేను నోచుకొనినంటినా?

భార—(నలుని జూపుచు)

సీ. తనయాజి యాచక । జనపేటికి జిగి
ర్చిన మావిగాగను । జెలగుచుండ
తనశౌర్యధైర్యముల్ । గనిభీతులైరిపు
భూదారులు నిగూఢ । వృత్తి మెలగ
తనచిత్తరాజంబు । వనజాలయామనో
హారుణకు రత్నసిం । హాసనముగ
తన సుందరాకృతి । వనజేక్షణా వీ
క్షణ కదంబమునకుజ్యో । త్స్నంబుగాగ

తే. గీ. నిషధ దేశంబు నేలు భూ । నేత యితడు
సత్యసంధుడు, కడు ధర్మ । శాలి; యాశ్రి
తజనసముదయత్రాణుండు । దాన పరుండు
చారుతరమూర్తి శ్రీనళ । చక్రవర్తి.

దమ—(సంతోషముతో నలుని గళమున బూలదండ వేయబోవును.)

భార—(వారించి) తొందర పడకుము,

తే. గీ. నలుని రూపంబుతో నొప్పు । నరపతులు; త
లోదరీ! యేవురుండిరిందు । లోన నిక్క
మైన నలభూపుడెవ్వడో । యరయ మార్గ
మింతయును దోచకున్నది । స్వాంతమందు.

దమ—(ఆశ్చర్యముతో జూచుచు తనలో) ఆహా! బృందారకు లెంతమాయ జేసి
నారు? తమ సందేశమునకు నేనట్లు ప్రత్యుత్తరమిచ్చితినని యాగ్రహించి
యీ భంగి జేసిరి కాబోలు. (ప్రకాశముగా)



తే. గీ. అబలనా నేను మీయెడ । వ్యామోహంబు
గన్గొనగ శక్తురాలను । గావగాన
కలయుకృపకంబూని నిజమైన । నలుని జూపి
యార్తనా నన్ను రక్షింపు । డమరులార.

నలు—(శచీ-దేవతలను జూచి)

తే. గీ. కామరూపము దాల్చి జ । గంబులందు
మహిమవిలసిల్ల జరియించు । మాన్యులార
నన్ను గృపజూడుడీ మిమ్ము । సద్భక్తి
నంజలిఘటించి వేడెద । నమరులార.

ఇంద్రు—(దమయంతిని జూచి)

తే. గీ. నిక్కమా నలుడను నేను । నీరజాక్షి
నమ్మి నామాట నన్నుము । దమ్మ మీర
జేకొని యశంబు గాంచుము । క్షితితలమున
సంశయంబును బొందకు । డెందమందు.

యము—తే. గీ. నిక్కమా నలభూపతి । నేను గలుగ
నేను నలుడంచు వచియింప । న్యాయమగునె
(దమయంతిని జూచి)
వారి వీరి మాటలు నమ్మి । సారసాక్షి
మోసపోవక నన్గొను । ముదమునందు.

అగ్ని—మీరు మంచివినోదమునే చేయుచున్నారు. దమయంతీ! వీరెవ్వరి మాట
లను నమ్మకుము. నేనే నలుడను.

వరు—బాగున్నది. నేను నలుడ, నేను నలుడనని మీరందఱును బలుకుచుండ నా
నలత్వము నెవ్వరిముందు ప్రకటింతును?

అందఱు—(ఆశ్చర్యముతో జూచుచున్నారు.)

దమ—(తనలో) అక్కటా! ఈసురులకు నాయందు దయకలుగక పోయెనే! నేనేమి
సేయుదును? (చేతులు మోడ్చి సరస్వతినుద్దేశించి) తల్లీ!

(అనుబంధము 8)

సరస్వతీ! నిను నిరంతరము బూజించు భక్తురాలనగు నాయందు గరుణ
వహింపవా?

మ. జననీ నీపదపంకజంబుల సదా । సద్భక్తి సేవించు నా
కనుమోదంబు ఘటిల్ల నైషధుని వే । డ్కన్ జూపి రక్షింపఁగా
మనమందెంచ విదేమి కారణమొ యం । బా! నిన్ను సేవించు వా
రిని నశ్రాంతము ప్రోచుచుండవె శుభ । శ్రీలిచ్చి భాషాసతీ!

అమ్మా! నీవు కరుణింపవేని నాప్రాణములఁ బరిత్యజించెద.

ఇంద్రు—(నలునిఁబట్టి ముందరికిఁదెచ్చి దమయంతింజూచి)

మ. పరితాపంబును బొందనేమిటికి నీ । భావంబులో నీ మనో
హరుఁడౌ శ్రీ నలరాజచంద్రుఁ డితఁడా । హ్లాదంబు సంధిల్లఁగా
సరగన్ గైకొని కీర్తితోఁ వెలయుమా । చంద్రార్కతారావనీ
శరధిస్థాయిగ దేవతా ప్రకరముల్ । శ్లాఘింప రాజాననా!

దమ—(నలుని కంఠమునఁ బూలదండ వేయుచున్నది.)

(అవనిక జారును.)

—ఇది ప్రథమాంకము.—





మంజుల నైషధమను

# చిత్రనళీయము

## ద్వితీయాంకము

రంగము:—బయలు [కామదేవుఁడు ప్రవేశము]

కామ—(తనలో) మానవుని సంతతసౌఖ్యాబ్ధిలో నోలలాడించునది కాంత; సంసారమును వృద్ధిఁజేసి యన్వయంబును నిలుపునది కాంత; శాశ్వతై[illegible]గంబుల సమకూర్చునది కాంత; స్వర్గశ్రీసమాశ్లేష సౌఖ్యంబుగలుగఁ జేయునది కాంత; కాంతలేకున్న జగమే లేదు. సృష్టియంతయుఁ గాంతతోడనే యున్నది. "ధనమూల మిదం జగత్" అనుటకంటె "కాంతామూల మిదం జగత్" అనుట బాగుగనుండును. ఎట్టియభీష్టము లాసించిన నట్టివి యొసంగు కాంతలుండఁగా, వేరె దైవము లెవ్వరు? దయ్యము లెవ్వరు? ఇట్టి కాంతలను ముందుంచుకొని జగములన్నియు నేనాడించుచున్నాను. బాలసమీర చైత్రులిరుపార్శ్వముల భజింపఁ గేకి, హంస, పిక, సైన్యము ముందు నడువ, శుకవాహనమును దుమికించుచు మదీయపుష్పశరంబులు ప్రయోగించితినేని మోహవార్ధిని మునుంగని స్త్రీపురుషు లెవ్వరు? పరమనిష్ఠాగరిష్ఠులై తపమొనర్చిన విశ్వామిత్ర దూర్వాసాది మునిప్రముఖులు మదీయ కుసుమకోదండమును సహింపలేక కాదా? కాంతావ్యామోహితాత్ములై యొప్పిరి. ఇట్టిమహత్తు నాయొద్ద నున్న కారణముచేతనే కలిరాజు తనపరివారములో నన్ను మొదటివానిఁగఁ జూచుచున్నాఁడు. ఏమైనను నేను లేకున్నచో వానిపరిపాలన మొకనిముషమైనఁ జరుగదు.

[క్రోధదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

క్రోధ—(తనలో) తాను లేకున్నచోఁ గలిరాజు పరిపాలనము సాగదని కామదేవుఁ

డు తలంచుచుందును. అది యట్లుండనిమ్ము. కలి వ్యాపారమంతయు నాతోడనే యున్నది. నేను లేకున్న కలివ్యాపారమే సాగదు. క్రోధోద్దీపిత మానసుండనై కనుంగవ నింగలంబు లగ్గలంబుగా రాల్పుచుఁ బుటాభిషిక్తమయ హేమకళపు సభాస్తంభాంతరాళ పాళికానిగుంభన నృహార్యత్వవన్నిజాంతరంగాభంగుర పరిపూర్ణ దీర్ఘ క్రోధ సంరంభుఁడనై, నిరుపమానాఖిల హాలాహలకీలికీలితా సంకీలిత కాలవ్యాళంబుల పోలిక దట్టపుఁ బుస బుసకొట్టుచు, సమగ్రవిగ్రహానేహస్సముదగ్రాగ్రహ మహాగ్రహ యగ్రీవ గ్రీవోదితాభోగ హేషాఘోషణ పోషణంబులైన సింహనాదములుగావించుచు, నిర్భిద్రరాద్రి రసోద్దీపిత చటుల భుజాస్ఫాల ననినదంబులుగావించుచు, శివసావసాన సముద్దండతాండవితచండికానాథ పాదసంఘట్టన ధ్వానసదృశంబగు నిజచరణతలసంఘట్టనముసేయుచు, నేనుబోయితినేని యెదుటనిలువఁగలవాఁడెవ్వఁడు? నేను లేకున్న లోకమొక్క నిముసకాలమైనను నిలువఁగలదా ? వ్యామోహితాత్ములయిన స్త్రీపురుషుల ప్రణయకలహమునందుఁగూడ నేను స్థానము నాక్రమించుకొని యుందును. (ప్రక్కకుఁ బోయి నిలచును.)

(లోభ దేవుఁడు ప్రవేశము.)

లోభ—(తనలో) "ధనమూల మిదం జగత్"అనుమాట యసత్యమా ? అంతయు ధనముతోడనేయున్నది. భక్తి ముక్తి భుక్తులకు ధనమే మూలము. ధనము లేని బ్రతుకు వ్యర్థము. మానవులకు ప్రహర్నిశలు సంతోషము కలుగఁజేయునది ధనము. నారీశిరోమణుల హృదయము దొంగిలించునది ధనము. అమూల్య సౌఖ్యభోగములఁ గూర్చునది ధనము. ధనము లేకున్న జగమే లేదు. కొందఱు దానములని ధర్మములని పలుకుచు ధనమును వ్యయము సేయుదురు. ఛీ ! ఇట్టిపనికి నాచిత్తము సమ్మతించదు. దానము లేమిటి ? ధర్మము లేమిటి ? ఉన్నధనము వ్యయమొనర్చిన, మరలనిచ్చువాఁడెవఁడు ? ధనహీనుని మొగమెవ్వరుచూచెదరు ? ధనమున్నవానిఁ జూచి, వీఁడు దానము సేయఁడనివ్యర్థము పలుకుచుందురు. వీరి తాతముత్తాతల సొమ్ము ధనవంతుల యొద్దదాచినట్లుగనే పలుకుదురు. ధనవంతులు కొందఱు ధనమును విచ్చి దానధర్మములందే మోక్షమున్నదని పలుకుచుందురు. మోక్షమునకును ధనమునకును సంబంధమే లేదు. ధనమున్నదిక దాచుటని నిక్షేపించుచుఁ గొందఱు ధరించుటకు చీని



చీనాంబరములకును, మణిమయభూషణంబులకును, వెచ్చించుచుందురు. ఏబట్ట కట్టుకొన్న నేమి? వస్తువులుండక పోయిన నేమి? గొంగళి కప్పుకొన్నచోఁ గాలము జరిగిపోవదా ? కొంచెము ధనమున్నచో దానినే విధముగనైన వృద్ధిసేయవలయును. దొంగలపాలుగాకుండ రాత్రులయందుఁ గాపాడ వలయును. దిక్కుమాలిన బ్రహ్మ రాత్రులేల సృష్టించెనో కదా ? ఎప్పుడు పగలే యుండిన బాగుండునుగదా ? (ఇంచుక యూరకుండి) ఇంకను కలిమహారాజు రాలేదేమో ! (ప్రక్కగా నిలిచియుండును.)

[ప్రవేశము:—కలి]

కలి—(తనలో) దుస్తరహస్త విన్యస్తాంకుశాధోరణ ధురీణంబులైన ర్నిరోధ క్రోధారుణ వీక్షణంబుల నక్షీణరూక్ష శుశుక్షణివిస్ఫులింగ నికరముల గురియుచు, నేను బయలువెడలితినేని, నన్ను రుద్రునిగను వీరభద్రునిగనుఁ దలంపక యుందురా? బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టిస్థితిలయ కారులఁట! నాయనుచరులగు కామ, క్రోధ, లోభులు లేకుండ వీరేమిసేయఁ గలరో ? ప్రపంచమంతయు నాకుఁ గ్రీడాప్రదేశమే. ద్యూతము, ప్రాణిహింస, సురాపానము, స్త్రీచింత, కలహము, మొదలగునవి యెక్కడనుండునో నేనక్కడనుందును, నేను తలంచుకొన్నప్పుడెట్టి వానినైన నిముసములో గల్పింతును. ధనికుని నిర్ధనునిఁ గాఁ జేయఁగలను. ఆపాదశతనుత్రాణ శిరస్త్రాణ శస్త్రాస్త్రధురంధరులైన రాజులలో గలహంబు నవలీలగా గల్పించి వినోదించుచుందును. నేనడుగు పెట్టినస్థలమున భగవత్పూజలు - ఆచారములు - దానధర్మములు పుణ్యకార్యాచరణములు మచ్చునకైనఁ గానరావు. ప్రపంచమంతయు నాతో నిండియున్నదని యెఱుంగక జనులు విష్ణుని - హరుని సేవింతురు. కాని, నన్నుఁ గొలువరు. నన్నుఁగొలిచినచో వారి యభీష్టములు కొఱఁతలుండునా ?

కామ
క్రోధ
లోభ } (ముందునకువచ్చి కలినిఁజూచి కలిమహారాజా ! జయము! జయము.

కలి—మిత్రులారా! వచ్చితిరా! మనము సత్వరముగాబోవలయును. విదర్భరాజతనయయగు దమయంతికి స్వయంవరము చాటింపఁబడినది.

(ధ్వనివినిపించును)

కామ—ఎక్కడనుండియో విమానధ్వని వినవచ్చుచున్నది. (ఆకాశమువంకఁజూచి)

మహేంద్రుఁడగ్నియమ వరుణులతో నెక్కడకో యరుగుచున్నాఁడు

కలి—(పైఁజూచుచు) మహేంద్రా! నీకుఁగుశలమా ?

(లోపల.)

కుశలమే - నీవిప్పుడెచ్చటికిఁబోవుచున్నావు?

కలి—దమయంతీస్వయంవరమునకు.

(లోపల)

ఆహాహా (నవ్వును)

కలి—మహేంద్రా! అట్లునవ్వుదవేమి ?

(లోపల)

దమయంతీస్వయంవరమనిన నవ్వువచ్చినది. అయిపోయిన స్వయంవరమునకు నీవేలపోవుచుంటివి! స్వయంవరమునకరిగి మేము వచ్చినాముకదా ?

కలి—మహేంద్రా! ఇదిగో వచ్చుచున్నాను. స్వయంవర విశేషములఁజెప్పుము?

(నిష్క్రమించును)

క్రోధ—మనకలిమహారాజు యింకను దమయంతిపై నాసపెట్టుకొని యరుగఁదలఁచినాఁడు.

కలి—(ప్రవేశించి) ఆహా! దమయంతి నలునివరించినదఁట. ఈదేవతలు స్వయంవరమునకరిగి విఫలమనోరథులైవచ్చిరి. ఎందుకుఁ బౌరుషములేనిబ్రదుకు! ఇఁక నేను శాంతమువహింపరాదు. దమయంతినివరించిన యీనలునకు నాప్రభావముఁ జూపవలయును. నేదలఁచినచోఁ జేతకాని పనియేమియున్నది. దమయంతిని నలుఁడువరించెనని వినినవిషయముకంటె దేవతలునవ్వు - నాహృదయమునఁ బ్రవేశించి యాపాదమస్తకముదహించి వేయుచున్నది,

తే. గీ. నవ్వినాఁడుకదానుర । నాయకుండు
నాదుయత్నమ్మునకునట్లు । నాప్రభావ
మరయఁజాలక, కానిమ్ము । మమరవిభుని
ముందు ప్రతినలుబల్కితి । పుడమినాథు
నైషధు సిరిహరించి కా । నలకుఁబంపి
నెలత నెడబాపి; యతికష్ట । నీచవృత్తి
యందుఁబెట్టి పెక్కుడుమల । నందఁజేతు.



అట్లుసేయకయున్నచోఁ గలినేకాదు - (ఇంచుకయూరకుండి) ఒక్కవిషయము మరలయాలోచనమున వచ్చుచున్నది. ఆనలుఁడు నావిషయమై యేమియపకారముజేసినాఁడు. అకారణముగ నాతనికిడుములు గల్పించినందువలన నాకువచ్చులాభమేమికలదు. (ఆలోచించి) లాభమేమి! దోషమేమి? అతఁడు దమయంతినివరించుటయే. ఇప్పుడు నేనాతని రాజ్యశ్రీలు హరించుటకేమియుపాయము పన్నుదును! (ఇంచుకయూరకుండి) జ్ఞప్తికివచ్చినది. పుష్కరుఁడున్నాఁడుకదా! అతనియొద్ద దేవలుఁడను బ్రాహ్మణమంత్రియున్నాఁడు. నేనట్లయినను, పుష్కరుఁడు నలునితోఁ జూదమాడునట్లుచేసి, యాజూదమున నలుండురాజ్యసర్వస్వము నోడునట్లుచేసెద. ఇదియే మంచిప్రయత్నము. (కామలోభులనుజూచి) కామలోభులారా! దమయంతీ స్వయంవరార్థమరుఁగఁదలఁచిన నాకోరికకట్ల విఘాతము సంభవించినది. ఈకారణముచేత నేనొకగొప్పప్రయత్నముఁ దలపెట్టినాను. మీరు మీనెలవులకరుగుఁడు. నాప్రయత్నమంతయు మీకుఁ గ్రమక్రమముగాఁ దెలియఁగలదు. క్రోధదేవా! నీవునావెంటరమ్ము.

(అందఱును నిష్క్రమింతురు)

---

(రంగము:-(నిషధపురము- ఉద్యానవనము- నలదమయంతులు -ప్రవేశము)

నలు—రమణీ! ఈవనమెంత రమణీయముగనున్నదోకంటివా? అటుచూడుము.

చ. తలిరుమెఱుంగుమించులు మ । దభ్రమరీరవగర్జనార్భటుల్
బలుమకరంద వర్షములు । భాసిలుదాడిమభూజ మేఘముల్
లలితశుకాననాతప ఫ । లచ్యుత బీజమహేంద్రగోప రా
శుల వనమెల్ల నిండెనదె । చూచితె కోమలసారసేక్షణా.

దమ—మనోహరా! ఇటుచూడుము.

మ. ధరణీశా శూలిపరిత్యజింపనగు నిం । దాభారమూఱంగలి
త్తరజోవ్యాజవిభూతినై ధృతమిళిం । దచ్ఛద్మరుద్రాక్షమై
మరలన్ సన్నుఁబరిగ్రహింపుమని ప్రే । మన్ శంభునింగూర్చి దు
ర్ధరదీక్షన్ దపమూనినట్లలరె నా । థా! చూచితే కేతకిన్.

ఈప్రక్కకురమ్ము.

మ. నృపచంద్రా! కనుఁగొంటె మోదమున నీ । వేతెంచయుక్తాళ్యనీ
కపుగీతంబులతో నశోకలతి కా । కాంతాళినీర్కుఁ బ్రివా

శపు మాణిక్యమయంపు బాత్రికలఁబల్ । శ్రద్ధం బ్రిమాన ప్రదీ
ప్తపుబిందూష్ని శుభంపుటారతులిడన్ । భవ్యోపచారంబుగన్.

నలు.—బింబాధరీ! మందమారుతము డెందమున కానందముం గొల్పనెంత చక్కఁగ వీచుచున్నదో ?

చ. మలయగిరిన్ వసించి యల । మానసదివ్యసరంబునీది, యా
వలిమలినాటలాడి నవ । పల్లవ పాళిగదల్చి వల్లికా
కుల వకుళామ్రకేతకుల । కూటములందు మరందమాని మ
త్తిలి ఘనసారవాసనల । దేలి సమీరుఁడు వీచె మెల్లనన్.

ఒక్కింత కాలమీ సరోవరతీరముననున్న యశోకవృక్షము నీడను విశ్రమింతము. రమ్ము.— (ఇంచుక నడిచి వృక్షముక్రింద నాసీనులగుదురు)

దమ.—నాథా! రాత్రి నీవు కన్న కలవిషయముం జెప్పఁదలఁచి మఱల మఱచిపోతివి. అనుగ్రహించి చెప్పెదువా?

నలు.—రమణీ! ఆకలఁగనిన సమయమునుండియు నాచిత్తము వికలతనొందియున్నది.

దమ.—అది నాకుఁ దెలుపఁగూడదా ?

నలు.—వెఱ్ఱిదానా! చెప్పిన నీవుగూడ విచారింతువను తలఁపు కాని మఱియొకటి కాదు. కలిమాయవలన నేను రాజ్యచ్యుతిం బొందినట్లు కలఁగంటిని.

దమ.—అక్కటా! పాడుకలఁగంటివే, దుస్స్వప్న పరిహారార్థము భూసురసమారాధనఁ జేయింతము.

నలు.—తలోదరీ! నేనెవ్వరికిని బుద్ధిపూర్వకముగా గాని, యెఱుంగక కాని, యేవిధమైన యపకారమునుఁ జేసియెఱుంగను. అట్టిచో భగవంతుఁడు నాయెడల నిర్దయవహింపఁడు. ఒక్క సంగతిమాత్రము మఱుగుచున్నాను. నీవు మఱియొకవిధముగఁదలఁపక ప్రత్యుత్తరమిమ్ము. నేను రాజ్యభ్రష్టుఁడనైనచో నీ వెందు పోయెదవు.

దమ.—నాథా! ఈయమంగళవాక్యము లేమి! ఎన్నడును నీనోటినుండి యిట్టినుడులు వెలువడలేదే.

నలు.—తరుణీ! మాటవరుసకడిగితినిగాని మఱియొకటి కాదు. కాలమెప్పుడును నొక్క తీరుగనుండదు కదా? ఎంతటివారికైనను నొక్కొక్క సమయమునఁ గష్టములు ప్రాప్తించుచుండును. ధీరోదాత్తుల హృదయమును భగవంతుఁడనేకవిధ



ములఁ బరీక్షసేయుచుండును. అప్పరీక్షకు నిలిచినవాఁడే కృతార్థుఁడు. ఎట్టిమహారాజు లెట్టికష్టములఁ బొందినారో నీ వెఱుంగవా?

మ. అనృతంబాడఁగలేక మాటపయి రా । జ్యశ్రీల నగ్గాధిపు
త్రునకర్పించి మహోగ్రకాననలకుం బు । త్రుండున్ సతీరత్నమున్
జనుదేరన్ జని; వారణావతములో । శాతోదరిన్ విక్రయం
బునుగావించుచుఁ దానునీచుని క్రియం । బున్ బొంది, యాపైజగ
ద్వినుతింగొన్న త్రిశంకసూను వినవో । బింబాధరీ! ధారుణిన్.

అందుచేత నే సమయమున నేది కలుగునో చెప్పఁజాలము. నిజముగా నాకు రాజ్యచ్యుతి సంభవించెనే, నీ వేమగుదువాయని శంక కలిగినది.

దమ.—

మ. అకటా! యిట్లువచింపఁగానగునె నా । థా! చిత్తమం దెంతయున్
వికలత్వంబును బొందెదేల నిఖిలో । ర్వీనాథ చూడామణిన్
సకలార్యస్తుత సచ్చరిత్ర, నిను రా । జ్యభ్రష్టుఁగాఁ జేయునే
యకలంకాత్ముఁడు; వెఱ్ఱిగాగ, మదినీ । యారాటమున్ మానుమా.

విధిప్రేరణమున నట్టిది సంభవించెనేని, నేనెందుబోవుదును. నాకు నీతోడిదెలోకము నీ వెక్కడనున్న నేనును నక్కడనేయుందును.

నలు.—

మ. గరితా! సంశయమేమిలేకయిదె ప । ల్కాణించెదన్ నీమనో
హర సద్భక్తికి సంతసించితిని రా । జ్యభ్రష్టతన్ బొందినన్
సరియే! దీనతఁబొందఁబోనెపుడు । పల్కన్ నీవుగల్గంగ నే
గొఱఁతల్ గల్గినఁగల్గనిమ్ము మదినా । కున్ సౌఖ్యముల్ గావొకో.

ఇందుముఖీ! నాడెందముననున్న చింతపోయినది. పరమేశ్వరుఁడు మనలను నిరంతరము రక్షించుఁగాక!

(వార్ష్ణేయుఁ డింద్రసేనుని నెత్తికొని ప్రవేశించును)

నలు.—(ఇంద్రసేనునిఁ జూచి) నాయనా! రమ్ము (ఎత్తికొని) సతీమణీ! మానవునకు సమస్తచింతలను బోఁగొట్టునది సంతానమేకదా? అందుకనే "అపుత్రస్యగతిర్నాస్తి" యని యార్యులు వక్కాణించియున్నారు.

సీ. పరమసౌఖ్యాప్తి । వరకార కాగణం
బునకు సుతుఁడె కదా । వనజవైరి

బహుఘోరసంసార । వారాసిఁ దరియింపఁ
జేయఁబుత్రుఁడె కదా । వెలఁగు నావ
శ్రీముక్తివామాక । సీమంతినిం గూర్పఁ
దనయుఁడే కదలగు । తార్పులాఁడు
సద్వంశవరకీర్తి । శాఖల వెలయింపఁ
బుత్రుఁ డెకద మేటి । భూరుహంబు
తే. గీ. పుత్రుఁడేకద సుఖముల । మూలమరయ
నాత్మజుఁడె కదా దురితల । తాలవిత్రుఁ
డట్టినందనోదయ భాగ్య । మందనట్టి
జన్మమది జన్మమా నవ । సారసాక్షి.

(కుమారు నెత్తుకొనును.)

(వార్ష్ణేయునిఁజూచి) వార్ష్ణేయా ! నీరాకకుఁ గారణమేమి?

వార్ష్ణే—దేవా! పుష్కరుండరుదెంచి సభామందిరమున దేవరదర్శనార్థమై నిరీక్షించుచున్నాఁడు.

నలు—అతఁడు నాతమ్ముఁడుకదా ! ఇప్పుడే వచ్చెదనని చెప్పుము. (దమయంతినిఁ జూచి) సఖీమణీ! నేనాతనితో మాటలాడి వచ్చెదను. నీవీకుమారునితో మందిరమునకుఁ బొమ్ము.

దమ—ఆర్యపుత్రా! స్వయంవరానంతరమున నాతఁడు నీతోఁ గలహించిన పుష్కరుఁ డిప్పుడు మరల వచ్చుటకుఁ గారణమేమై యుండునో?

నలు—నాయనా ! రమ్ము—(కుమారునితో నిష్క్రమించును)

రంగ:—[నలునికొలువుకూటము—పుష్కరుఁడు—దేవలుఁడు. ప్రవేశించుచున్నారు.

పుష్క—మిత్రమా ! నీవు మంచియుపాయమునే యరసితివి.

దేవ—పుష్కరా ! నావంటి మిత్రుఁ డున్నందువలన నీకేమి లాభమున్నది? మిత్రుని యభీష్టముఁ దీర్చుట కన్న నాకుఁ గావలసిన భాగ్యమేమికలదు.

మ॥ ఘనఖడ్గంబు ధరించి హస్తమున సం । గ్రామంబులో శత్రుభూ
రణమొక్కింతయు సల్పకుండజనులా । రాయించుశ్లాఘింపఁగా
జననాథాగ్రణులన్ దురోదరములో । సంప్రీతినోడించి, యో
యనఘా! నీకునుఁ గూర్తునంపదలు, వి । ద్యాసైపుణిం జూడుమా.



పుష్క—నీయట్టి మిత్రుఁడుండఁగా నాకుఁ గొఱఁతకల్గునా?

దేవ—సేవకా! మీరాజేంద్రుఁ డింకను రాలేదేమి?

సేవ—అదుగో! మామహారాజుగారు వచ్చుచున్నారు.

(నలుఁడు—ప్రవేశించును.)

నలు—(పుష్కరునిఁ జూచి) తమ్ముఁడా ! పుష్కరా! (కౌఁగిలించుకొనఁబోవును.)

దేవ—(వారించి ఉండవయ్యా నలరాజా! కడుపులో లేనిప్రేమ కౌఁగిలించుకొనిన వచ్చునా ?

నలు—దేవలా ! అట్లు పలికెదవేమి?

మ॥ అను జన్ముండరుదెంచెఁగా యని సము । ద్యత్ప్రీతి వాటిల్ల నా
తని యాలింగన వార్ధిఁదేలఁగనుచి । త్తంబందు నూహింప నన్
జనునే నీవిటు లడ్డగింపఁగను

దేవ—నీ । సౌదర్యమున్ జూపఁగన్
జనపాలా తరిగాదు; వచ్చిన పనిన్ । గావింపఁగాఁ జూడుమా.

నలు—తమ్ముఁడా! దేవలుఁ డిట్లుపలుకుచున్నాఁడేమి?

పుష్క—సోదరా! దేవలుని మాటకేమి? నేనొకకార్యము సంకల్పించుకొని నీకడ కరుదెంచితిని.

నలు—నేను చేయవలసిన కార్యమెట్టిదైనను దప్పక చేయుదును.

పుష్క—నలరాజా! వినోదార్థము నీతోఁ జూదమాడుటకు వచ్చితిని.

నలు—తమ్ముఁడా! నీకీ యభిలాష యేల కలిగినది?

తే. గీ పాపమొదవుఁ గీర్తియు నెడ । బాయు; ధనము
నాశనంబగు వైరమున్ । గలుగఁ జేయు
నందుచేతఁ ద్యజించెద । రార్యులెల్ల
జూదమును దమ్ముఁడా ! యిట్టి । చొప్పువలదు.

దేవ—రాజేంద్రా! మాకు నీవు నీతులుగఱప నవసరములేదు. నీవు ద్యూతకళాకుశలుండవగుటం జేసి నీతమ్ముఁ డందుకు నిన్నాహ్వానించుచున్నాఁడు. ధర్మయుద్ధమునకును, వినోదార్థము జూదమాడుటకును బిలిచినప్పుడు పలుకఁ బడదని చెప్పుట క్షత్రియోచితగుణముకాదని నీవెఱుంగకయుంటివా?

పుష్క—తే. గీ. పెక్కుమాటలఁ బనియేమి । పృథ్వీనాథ
యాడలేకున్న నోడితి । నంచుఁబలుకు

మంతి యేచాలు;

నలు— నవకీర్తి । యాంచు నుడువ
వినకయీరీతి నుడువుదే । వెఱ్ఱివగుచు.

కానిమ్ము. నీకోర్కె దీర్చుకొందువు గాక ! రమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

రంగము.— (నలుని కొలువు కూటము ముందు ప్రదేశము— వార్ష్ణేయుఁడు ప్రవేశము)

వార్ష్ణే— ఔరా! ఈ జూదమునందెంత యాకర్షణ శక్తియున్నది. దేవలుని ప్రేరేపణమునఁ బుష్కరుఁడు వచ్చి యడిగినయంతనే నలుఁడు జూదమాడుటకు గడంగి యహోరాత్రము లేకదీక్షతో నాడుచున్నాఁడు?

చ. వలదని యెంతచెప్పినను । పార్థివ చంద్రుఁడు వీనులందు నా
పలుకులు జేర్చకుండ బల । వంతము సేయఁగఁ బుష్కరుండు; వ్యా
కులమను మాటలేక నయ । కోవిదుఁడయ్యును నాడుచుండె; నే
సిలుగులు వచ్చునో తుదకు । జిత్తముఁ నన్ వగదోచెనక్కటా.

తే. గీ. సకల సంపదల్ గజముల । శ్వతతి రథము
లాయుధంబులు తుదకు రా । జ్యంబునెల్ల
నొడ్డి విధికృతంబున నోడె । నుర్వీధవుఁడు
కాలమహిమ నెవ్వఁడు దాటఁ । గలఁడు జగతి.

అక్కటా! పరమేశ్వరా! సత్యసంధుఁడును ధర్మవ్రతాచార పారీణుఁడును, నగు నలసార్వభౌమున కెట్టియాపదఁ దెచ్చి పెట్టుదువో కదా? (ఇంచుకయూరకుండి) అయ్యో! ఆపుష్కరునకు నలునిఁజూచినఁ గోపమధికము. ఎట్లయినను బగదీర్చుకొన వలయునని ప్రయత్నించుచుఁ దుదకు దేవలుని ప్రోద్బలంబున నిట్టిమాయ జూదము నకు గడంగి, సర్వరాజ్యశ్రీలను హరించినాఁడు. ఇఁక నేమిసేయునో!

(నిష్క్రమించును.)

---

రంగము:— [ద్యూతగృహము— విగతభూషణుఁడైన నలుఁడును బుష్కరుఁడు దేవలుఁడును బ్రవేశించుచున్నారు.]

దేవ— (పుష్కరునిఁజూచి)



మ. భళిరా పుష్కర! మెచ్చవచ్చునిను భా । వంబందుఁ గద్యూతకౌ
లుడౌళ నైషధు నోడఁజేసితివి రా । జ్యశ్రీల గైకొంచు;
(నలునిఁజూచి)
ఓ! నరనాథాగ్రణి! ముందెయాడననుచుఁ । వాక్రుచ్చితే యున్న నీ
కరణిఁ జింతఘటిల్లునే యకట! భా । గ్యంబెల్ల పోనాడుదే.

పుష్క— నలా! సర్వము నోడిడితివి. పణముగా బెట్టుట కింక నేమైనఁ గలదా?

నల— పుష్కరా! నీ వెఱుంగని దేమున్నది! నేను మాత్రము మిగిలితిని.

దేవ— నీవు కాదు. ప్రశస్తమైన వస్తువున్నది.

నల— దేవలా! ఊహించినంతవఱకు నాకెక్కడ నేవిధమయినదియుఁ గనిపించు టలేదు.

దేవ— నీవు బాగుగ నాలోచించలేదు. నీయింటనే యున్నది.

నలు— నాకేమియుఁ గనిపించుటలేదు.

దేవ— పోనిమ్ము. నేను చెప్పనా?

నలు— అయ్యా! చెప్పుము! సంశయమేమి యున్నది?

దేవ— చెప్పిన నాగ్రహించెదవేమో?

నలు— ఆగ్రహ మెందుకు?

దేవ— సరే! ఇఁక దాపనేల? దమయంతి లేదా?

నలు— (కోపముతో)

చ. పరమపతివ్రతామణి న । పారగుణాకర నార్యవంద్య నీ
కరణి వచించెదే తులువ! । గర్వము కన్నులఁగప్పెనే, ధరా
మరకులమందు నేకరణి । ద్ధ్మాతలమందున బుట్టినావొ దు
శ్చరితుని నిన్ను సైచితినిఁ । జంపక సత్కృపఁబూనుచుఁ మదిన్.

పుష్క— నలా! నీ కోపమెవ్వరిపైఁజూపెదవు.

ఉ. నేరమొకింతలేని యువ । నీసుర చంద్రుని నాదు మిత్రునిన్
దూరెదవేల? నీవు గత । దోషుఁడవాడవె యింతమాత్రలో
నారయకున్నవాఁడవె య । హా! యని నక్బురినుండి పంపు నీ
కూరిరతనంబు నిన్ను నయ । కోవిదులెల్లరు నన్ను తింతురే.

నలు— దినములు తప్పివచ్చినప్పుడు నీవెట్లయినను మాటాడఁగలవు. (దేవలునిఁజూచి)

ఓరీ! బ్రాహ్మణరూపచండాలా! నీవు నేఁడు బ్రతికిపోయితివి.

పుష్క—నలా! ఇక నీవాక్పేటికకు బీగము వేయుము.

తే. గీ. ద్యూతమందున సర్వంబు । నోడిపోయి
కట్టుగుడ్డతో మిగిలిన । కలుష మతివి
లజ్జవిడనాడి సుగుణ ల । లాము వాదు
సఖుని బ్రాహ్మణు దూషింప । సాగినావె.

దేవ—పుష్కరరాజా! సర్వము మనకప్పగించి సన్యాసియైన యీనలరాజుతో కాదు కాదు. నలునితో వృథాప్రసంగము మనకేల? (నలునిఁజూచి)నలా! నీవీనాఁడే పురమ్ము విడిచి యాలుబిడ్డలతోఁ బోవలయును. (పుష్కరునిఁజూచి) పుష్కరసార్వభౌమా! నీయాజ్ఞ యిట్టిదేకదా?

పుష్క—అవును.

నలు—(తనలో) అక్కటా! ఎట్టిదుర్గతి వాటిల్లినది. పరమేశ్వరా! నీచర్యలతి చిత్రములు.

మ॥ ధనికున్ బేదగఁ బేదచున్ ధనికుఁగా । ధర్మాత్మ సంవేద్యు దు
ర్జనుగాఁ దుర్జను ధర్మతత్పరునిఁగా । సంప్రీతిఁ గావించుచున్
ఘనుఁడౌ గారడి వాని చందమున లో । కశ్రేణిఁ బావింతు, నీ
మన మెవ్వారు గనంగశక్తులు సుధ । ర్మాంభోధిచంద్రోదయా.

(ప్రకాశముగా) పుష్కరా! నీవు నన్నుఁగూర్చి ప్రాకయింపఁ బనిలేదు. నేను నేఁడే పురము విడిచిపోయెదను. కాని యొక్కవిషయము మాత్రము నీతోఁ జెప్పవలసి యున్నది.

తే॥ గీ॥ కన్నబిడ్డల భంగినిఁ । గాచుచుంటి
నింతవఱకుఁ బ్రజలనింక నీ । వెట్లువారి.
గావఁబూనెదొ తమ్ముఁడా । కరుణఁబూని

పుష్క— యిన్నినీతులు వచియింప । నేలనీకు.

నలు—పుష్కరా! నేను పోయివచ్చెదను. (నిష్క్రమించును)

దేవ—పుష్కరా! రాజ్యపరిపాలనా విషయములు నీకు బాగుగఁ జెప్పవలయును. సావకాశముగఁ దెలిపెదను. రమ్ము.

(నిష్క్రమింతురు.)



రంగము:-[నలుని యంతఃపురము-ప్రవేశము విచారముతో దమయంతి]

దమ—(తనలో) అనుబంధము 9)

సీ. చలమువహించి, పు । ష్కరుఁడేల, యేతెంచి,
విభుని జూదమునకుఁ । బిలిచినాడు
పిలిచియుండెను గాక । వలదంచు బలుకక
యుర్వీశ్వరుండేల । యొప్పవలయు
యొప్పియాడెను గాక । తప్పఁద్రోవను వారు
జూదమాడఁగనేల । చూడవలయు
చూచి యుండిరి గాక । శుద్ధాత్ముఁడిదియంత
గ్రహియింపలేకేల । గ్రాలినాడు

తే॥ గీ॥ యకట, కలిశరీరముపైన । నావహింప
విభుఁడు సర్వంబు గోల్పోయి । వెఱ్ఱియయ్యె
నేమిసేయుదు నింకనే । నెందుఁజొత్తుఁ
దోయజభవుని నేమంచు । దూరుదాన.

(వార్ష్ణేయుఁడు—ప్రవేశించును)

వార్ష్ణే—(దమయంతినిఁ జూచి) తల్లీ! చెప్పుటకు నోరాడకయున్నది. పుష్కరుఁడు మనరాజ్యశ్రీలన్నియు ద్యూతమున గెలిచి, మహారాజును పురినుండి నేటి రాత్రియే వెడలుమని చెప్పినాడు.

దమ—హా! ఎంతకష్ట మెంతకష్టము! (మూర్ఛిల్లును)

(నలుఁడు—ప్రవేశించును.)

నలు—(వార్ష్ణేయునిఁజూచి) వార్ష్ణేయా! దమయంతికి సర్వము దెలిసినదా?

వార్ష్ణే—దేవా! సర్వము నెఱింగించితిని.

దమ—(మూర్ఛ తెలిసి లేచి నలునిఁ జూచి)

సీ. ప్రాణేశ యేమంచు । భావింతు మదిలోన
మనకెట్టి దుస్థితి । తనరె నిపుడు

నలు— విపదబ్ధిలోపల । వెలఁదిరో మున్గితి
భూరి దుఃఖంబును । బొందఁగంటి

దమ— దాయాదుఁ డారీతి । ధనమెల్ల గెలువంగఁ
దుచ్ఛభూదమటం చుఁ । దోఁచ లేదె

నలు— విధికృతంబా భంగి । వెలఁదిరో కనుగప్ప
మహితవిజ్ఞానంబు । మాయమయ్యె

దమ— దైవకృతం బిట్లు । దనరుచు నుండంగ
వగఁ జెంద నేమి లా । భంబుగలదు

నలు— సకల రాజ్యశ్రీలు । చానరో నను బాసె
సబలవానీ వేడ । కరుగ గలవు

దమ— ప్రాణేశ! యీమాడ్కి । పలుకంగ నేటికి
నేనెందు బోవుదు । నిన్ను విడిచి

నలు— పరదేశముల యందు । పడలేవు బాధల
పుట్టినింటికిఁ బొమ్ము । పొలఁతిమిన్న

దమ— జీవేశ నిను వీడి । చేరుదానన యట్టు
లిర్వురముగలిసి । యేగవచ్చు

నలు— రాజ్యచ్యుతినిఁ బొంది । రమణిరో యుత్తిల్లు,
చేరఁగా నొప్పునే । సిగ్గుగాక

దమ— పోనిమ్ము నీబుద్ధి । పోయిన యట్టులే
యెచ్చోటి కైనను । నేగవచ్చు

నలు— కడగండ్ల నోర్వఁగా । కాంతరో శక్యంబె
పుట్టిన యింటికే । బొమ్ముమబల

దమ— అర్హామే యీరీతి । నాడగాఁ గలనైన
నిను బాసి జీవేశ । తనరగలనె

నలు— పద్మాక్షి యీరీతిఁ । బల్కిన మనచిన్న
పుత్రుఁడెచ్చోటికిఁ । బోవఁగలఁడు

దమ— దీనికై యీవిధి । దీనతఁగన నేల
తాతయింటికిఁ బంపఁ । దగును వాని

నలు—హా యింద్రసేన! హా । హా సుకుమార! యీ
నలుఁ డెంత కఠి । నుఁడై యలరినాఁడొ



వార్ష్ణే— తల్లి యో దమయంతి! । తండ్రి యో నలరాజ!
వగపుఁ జెందిన నేమి । ఫలముకలదు

(ఇంద్రసేనుఁడు నిద్దురకన్నులు నులుముకొనుచు)

ఇంద్ర— తండ్రి ! ఈరీతి ఖే । దంబు నీ కేల నా
వలనఁ దప్పే దైనఁ । గలదె చెపుమ

నలు— తండ్రిని గానయ్య । తనయ! నీకిఁక నేను
దాయాదిగామదిఁ । దలఁపుమయ్య

ఇంద్ర— అమ్మరో యిదియేమిః । యయ్య యిట్లు వచించు,
చిత్తంబువగ పల । చెందెనమ్మ.

వార్ష్ణే—అక్కటా! మీరీరీతి విచారించుచున్నచోఁ బసిబాలుండగు నీతఁడు బెంగపెట్టుకొనఁడా—(ఇంద్రసేనునిఁ జూచి) నాయనా! ఆడించెదను రమ్ము. (కుమారు నెత్తుకొని నిష్క్రమించును)

(ప్రవేశము:—దేవలుఁడు)

దేవ—నలా! ఇంకను నీవిక్కడనే యుంటివా? ఈరాత్రియే నిన్నుఁ బురినుండి వెడలిపొమ్మని పుష్కరుఁ డాజ్ఞాపించియుండెను గదా?

దమ—(చాటునకుఁ బోవును)

నలు—భూసురోత్తమా? సాహసించి అంతఃపురాంగన లుండుమందిరమునకు రాఁజెల్లునా? నీవు సకల ధర్మములు తెలిసిన వాఁడవుకదా?

దేవ—పురములు—అంతఃపురములు—సర్వము—మాపుష్కరుని వశమైనవి. నేనెఱుంగక యిందుఁ బ్రవేశింపలేదు.

నలు—ఆర్యా! ఈయనవసర ప్రసంగముతోఁ బనియేమి యున్నది, నేనీ రాత్రియే వెడలెదను.

దేవ—మాటలవలనఁ బ్రయోజనము లేదు. క్రియఁ జూపింపవలయును. నేనుండఁగానే వెడలినచో నామనస్సునకుఁ గూడ శంక లేక యుండును.

నలు—శంక దేనికి.

దేవ—దేనికని చెప్పను. దారిద్ర్యపీడితాత్ములకు ధనమందాశ యెక్కువ. అందుచే నీచేయిని గొంచెము చౌర్యములోనికిఁ బోనిచ్చెదవేమో యని యనుమానము.

నలు—బ్రాహ్మణోత్తమా! నావిషయమై యనుమానమును బొంద[illegible]మునను నేనిప్పుడే నగరము విడిచిపోయెదను.— (అనుబంధము 10)

ఇది ద్వితీయాంకము. (నిష్క్రమింతురు)



మంజుల నైషధమను

# చిత్రనళీయము.

## తృతీయాంకము.

రంగము.—[అరణ్యము:—కలిప్రవేశము]

కలి—(తనలో) నాప్రభావమునకు సాటి యీపదునాల్గుజగములను లేదు. పుష్కరుని మిత్రుఁడగు దేవలునిఁ బాత్రిగాఁజేసి పుష్కరునిచేత మాయాద్యూతనాటకమాడించి, నలునిరాజ్యశ్రీలహరింపఁజేసి, పురము వెడల నడిపించితి. కానిమ్ము. నలదమయంతులను నీయరణ్యమునఁ బెట్టవలసిన యిడుమలఁబెట్టెదనుగాక—(నిష్క్రమించును)

(నలుఁడు—దమయంతితోఁ బ్రవేశించును)

(అనుబంధము 11)

నలు—హా! సతీమణీ! హరిత్సము దయాచ్ఛాదితమేదినీధరనికరాకరమరకతమణిచ్ఛాయా కలాపంబు లాలోకించి, నిచ్చలున్ బెచ్చువెఱిగిన పచ్చికల మెసవ నిచ్చగొని హెచ్చుగా విచ్చలవిడి వాఱు హరిగణంబులును, బిలాంతరాళంబులనుండి మేతకై వెడలి తిరుగుచు దురదకై నితంబకదంబకంబుల పేటులఁ బీటబెట్టిన మేటిమాత్రికుల బెటిలివడ రాచుకొనుచు, నికటమునఁ జీమచిటుక్కుమనిన బెదరి చివాలున దూరదూరంబుగా బాఱుచు నతినిశితరదనసంఘట్టనంబుల నిప్పులుప్పతిల్ల, ఘనఘనాఘనగర్జానినాదసమధ్వానంబుల ఘుర్ఘురింపుచు, గహనతలముఁ గలయ మెలఁగు వరాహసమూహములును, కటన్ బుట్టి మట్టుమీఱిరోషరసావేశపు వేండ్రంబు దీండ్రింప గాండ్రుమనుచు, నెదుటఁ గనఁబడుకొండ గోఱియలపైఁబడి బుఱియలఁ బగులగొట్టి, నెత్తురుం ద్రావి,



పలలభిత్తంబులు గుత్తుకదాక మెక్కి, గుఱుకవెట్టి కందరంబుల నిద్రించు గబ్బిబెబ్బులులును, మహారావ్రాకారంబుతోఁ నాకలిందీర్చుకొనఁ గందరంబులు బొబ్బరిల్లగొబ్బున నబ్బురపుబొబ్బలిడుచు మత్తమాతంగ సంఘములకై వెదకు కంఠీరవంబులును, తతకుంతితకంఠ సంజనిత భయంకరనిర్హ్రాదకోలాహలంబుల గుండియలవిసి కలగుండువడు ననేకమృగంబులును, సమగ్రకృష్ణకుండలిప్రకాండంబులవలె గండుమీఱుతుండంబులసాది, నవీనపల్లవితసల్లకీమతల్లికాపల్లవంబుల నుల్లాసంబుననందుకొని యారగించుచుఁ గేరుగంధసింధురసందోహంబులును, గలిగి, మహాభయంబును గొలుపుచున్న ఘోరారణ్యమును బ్రవేశించితిమి.

దమ—తే. గీ. ఎత్తుపల్లముల్ చరణంబు ॥ లొత్తుకొనెడి
సన్నసన్నముళ్లు; ఘనపా ॥ షాణసమితి
నత్తిపై వేడియెండ, నే ॥ నెట్లునడవ
శక్తురాలను గానలో ॥ సార్వభౌమ.

అక్కటా! నాకంతకంత కాయాసమధికమగుచున్నది. అడుగుఁదీసి యడుగుఁబెట్టఁజాలకయున్నాను.

నలు—అక్కటా! దమయంతీ! నీదుర్గతికి నేనేమని వగతును.

మ॥ చతురంభోధిపరీతభూవలయరా ॥ జన్యాన్వయోత్తంస సం
తతిలో నెక్కువవాఁడు నైషధుఁడు మ ॥ ద్భాగ్యం బసామాన్యమై
క్షితినొప్పారు నటంచు మోదముమెయిన్ ॥ జిత్తంబులో నెంచి నీ
కబతిఁగాఁ గొన్నఫలంబు నీకిటుల సం ॥ ప్రాప్తించెగా సుందరీ!

అయ్యో! సుందరీమణీ! నిన్నరణ్యముల సంచారముచేయఁ జేసితినిగదా! ఈయిక్కట్టులన్నియు నీకు నామూలముననఁగాదె.

దమ—తే. గీ. చెమ్మటలు గ్రమ్ముచుండె దే ॥ హమ్మునందు
నోటఁ దడియారుచుండెను ॥ మాటరాదు
వశముగాకుండె నడలు కం ॥ పరము పుట్టె
నాథ! చేయఁగల్గినదేమి కా ॥ ననమునందు.

అయ్యో! ఇఁకనడువఁజాల (కూరుచుండును)

నలు—ఎంతకష్ట మెంతకష్టము. దమయంతీ!

చ॥ జనకుని యింటికేగుమని । చక్కఁగ దెల్పిన నాదు వాక్యముల్
వినకతలోదరీ! యిటుల । భీకర కానకు వచ్చి యక్కటా!
ఘనవెతలందుచుంటివిఁ । కుంజజవాసితకు నేనిఁగా మనం
బునఁ దలపోయువాఁడ; వగ । పుట్టదె నీసుఖబింబమున్ గనన్.

తే. గీ. చారుశారద పూర్ణిమా । చంద్రుపోలు
వదనమా! వాడె నిశియందుఁ । బద్మమట్లు
సరసిజంబులదించు నీ । చరణయుగళి
యరుణకాంతి వహించెనో । యతివమిన్న.

నీవు పుట్టిన యింటికిఁబోయియుంటివేని, నీకీకష్టము లేక యుండునుగదా ? ఇదియే కదా నీవు నావెంటవచ్చి పడుచున్న సౌఖ్యము.

దమ—(తొందరగా లేచి) ప్రాణేశ్వరా ! ఆయాసమడగినది. లెమ్ము. నెమ్మదిగా పోవుదము.

నలు—రమణీ! నేనామాటయనిన నీవీ మాటయందువా? పుట్టినింట నున్నచో నిట్టి కష్టములఁ బొందకయుందువు కదా ? యని యట్లుపలికితిని గాని నీరాక నాకు గష్టమా ? అయ్యో ! ఎంత వెఱ్ఱిదానవు. నన్ను నిరంతరామోదపరిపూరిత మనస్కునిఁగఁ జేయుచుండు నీభువనమోహన విగ్రహము నాకన్నుల యెదుట నున్నంతవఱకు నేనెట్టి యిక్కట్టులనైనను భరింపఁగలవని నమ్ముము. హా ! సతి! నీకాకలిబాధ మిక్కుటముగ నున్నది కాబోలు ! విమలసలిలపూరితమైన కాసారమైన సమీపమునఁ గనిపించుటలేదే. (ఎదుటఁజూచి అదిగో ! మన కెదురుగ నొక రసాలసాలము కనిపించుచున్నది. దాని చాయకుఁ బోవుదము రమ్ము.

[ఇరువురు నడచి వృక్షమునీడకుఁ జేరుకొందురు]

నలు—భామామణీ !

తే. గీ. అగ్నిసాక్షిగ గైకొన్న । యతివయిట్టు
లాకటికి మందుచుండంగ । నరసియొక్క
కబళమన్నమే నిడలేని । కాంతుఁడయ్యె
గా నలస్నృపాలచంద్రుండు । కాలగతిని.

దమ—నాథా! విచారించినందువలనఁ బ్రయోజనమేమి యున్నది?



నలు—తే. గీ. తొల్లిభవమందునే పాప । ములను జేసి
యుంటినో తత్ఫలంబిప్పు । డొందుచుంటి
నిజసతీమణితో డవ । నీస్థలులను
కడుపునకుఁ గూడులేకను । గాలగతిని.

(పైనుండి యొకఫలముపడును)

నలు—రమణీ! భగవంతుఁడు మనయెడల దయఁజూని కాబోలు. యీఫలమును మన ముందుఁ బడవైచినాఁడు. నీవు సత్వరముగ దీనిని భుజించి యాకలినిదీర్చుకొనుము.

దమ—నాథా ! ఇట్టికార్యము నాకుఁ ధర్మమా ? పతిభుజింపక పూర్వము సతి భుజించునా ?

నలు—తే. గీ. తరుణి! యాకట కృశియించు । దాన నీవు
పురుషుఁడను నోర్వఁగలవాఁడఁ । బొలఁతి నేను
బాధ నాకంతగా లేదు । పతియొయిచ్చు
నప్పుడు భుజియించుచో దోష । మంటఁబోదు.

దమ—నాథా ! నీవట్లు పలికెదవుగాని నీకు మాత్రమాకలిబాధ లేకయున్నదా ? నీవు భుజియింపకుండ నే భుజియించుటకు జిత్తము సమ్మతించునా? కరుణించి నీవు సగము భుజించి తక్కినది నాకొసఁగుము.

నలు—తరుణీ! నేను చెప్పెడిమాట వినవుకదా? ఈచిన్నపండుతో రెండు భాగములు కావలయునా ?

దమ—ప్రాణేశ్వరా! వేళతప్పినచో నాకలిబాధ యడఁగిపోవును. ఇంతకుమునుపున్న యాకలి నాకిప్పుడు లేదు. ఈఫలమును నీవే భుజింపుము. నీవు భుజించినచో నాకడుపునిండిన యట్లే. సందియమందకుము. వృక్షమున నింకొక ఫలము దొరకకయుండునా ?

నలు—(చెట్టువంకఁజూచి)

ఉ. ముందున కైన నొక్కఫల । మైనను లేదుసుమీ మహీరుహం
బందు నిదేమి యద్భుతము । వారిజనేత్రి! యిదెట్లువచ్చె; నే
మందును నిద్ది మాయఫల । మౌనని సంశయమయ్యె నక్కటా

దమ—సందియమేల నాకిదియు । సంతసమొందుచు నేభుజించెదన్.

నలు—అయ్యో! ఏమి విషఫలమో?

దమ—అందులకనే నేనుభుజించెదనని చెప్పితిని.

నలు—అక్కటా! నాకు దుఃఖము తెచ్చిపెట్టెదవా? రమణి! నీవువలదు. దీనిని నేనే భుజించెదను.

దమ—(చేయిఁబట్టుకొని) వలదు. వలదు. నీకు హానిసంభవించిన నాకుగాదా? ఇరువురమును బంచుకొందము.

(తినుటకుఁ దలంచుచుండఁగా నొకబ్రాహ్మణుఁడు ప్రవేశము)

బ్రాహ్మ—శ్రీహరీ! ఎంతబాధ తెచ్చిపెట్టితివయ్యా?

నల—స్వామీ! బాధయేమి?

తే. గీ. భవ్యభవదీయ దివ్యాంఘ్రి । పద్మములకు
మ్రొక్కఁజాలము లేచి యా । భూసురేంద్ర
యిచటనుండి నమస్కృతు । లిడెదమయ్య
సేవకునిపైనఁ గరుణించి । చిత్తగింపు.

బ్రాహ్మ—

తే. గీ. కడుపునకుఁ దిండిదొరకక । కానలోన
మార్గమును దప్పి యీరీతి । మసలుచున్న
వానికేల ప్రణతులు లా । భంబుకలదె
కడుపు నిండించునే యవి । పుడమిపాల.

ఓయీ! ఈకల్లబొల్లి మాటలు; దొంగభక్తిప్రణామములు మాకెందుకు. నీకేమియి నశక్తి యున్నచో నాకడుపు నిండుట కాహారముఁ బెట్టుము.

నలు—ధరామరోత్తమా! నీవుగూడ మావలెనే యాఁకటిబాధను గృశించుచుంటివా?

బ్రాహ్మ—సరి సరి. నీవు మాటలలో మంచిజాణవలె నున్నావు. ఆహారమేమైనఁ బెట్టవలసివచ్చునేమోయని ముందుకాళ్లకు బంధము వేయుచుంటివా? మంచి తెలివిగలవాఁడవయ్యా!

దమ—మహానుభావా! ఈమహాపురుషుఁడు పలికినది యసత్యముగాదు.

తే. గీ. సప్తజలనిధి వలయిత । క్ష్మాతలంబు
పాలనము సేయుచుండు భూ । పాలవరుఁడు



కాలవశమున నీలీలఁ । గానలందు
సంచరింపంగ వలసెను । క్ష్మాసురేంద్ర.

కాకున్నచో నీతఁడొక బ్రాహ్మణుని యాఁకలి బాధ తీర్పలేనంత యశక్తుఁడగునా?

బ్రాహ్మ—సరే; ఈతఁడు చక్రవర్తియని చెప్పనక్కఱలేదు, ముఖలక్షణములే చెప్పుచున్నవి. (నలునిఁజూచి) నృపాలా! నీచేతిలో నేమోయున్నదే?

నలు—బ్రాహ్మణోత్తమా! ఈవృక్షమున నెక్కడఁజూచినను నొక్కఫలమైనను లేదు. ఇది మాత్రమెట్లు మాముందుపడెనో చెప్పఁజాలము. మాదుర్దినములను బట్టి యిదివిషఫలమేమో! యని సంశయించుచున్నాము.

బ్రాహ్మ—ఏమీ! నీకట్టిసందేహముకలిగినదిగా? ఏదీ చూతము.

(నలుఁడు ఫలమునిచ్చును)

బ్రాహ్మ—(పుచ్చుకొని తినఁబోవుచున్నాఁడు)

నలు—మహాత్మా! మాకుఁ బాతకము సంభవించును. తినవలదు. తినవలదు.

బ్రాహ్మ—(తినుచు) పాతకమా! నీకు సంభవించునా? నాయనా! ఇట్టిమాటలు పలుకుట బాల్యమునుండియు కష్టపడి నేర్చుకొంటివా? విషఫలమని బొంకితివే. ఆహా! ఎంతమాధుర్యముగ నున్నదయ్యా? నోటవేసికొనఁగనే అవలీలగ గొనికిఁ బోయినది. ఇటువంటి పండు మఱియొకటిదినవాంఛగలుగుచున్నది. ఎక్కడనైనదాఁచితివేమీ బ్రాహ్మణునకిచ్చిన పుణ్యమేగాని పాపముకాదు. తెమ్ము.

నలు—దేవా! పండురుచిగనే యున్నదా?

బ్రాహ్మ—రుచియని యడుగుచుంటివా! కడుపు పూర్తిగా నిండినది. ఇఁకనీవు విచారించినను ప్రయోజనము లేదు. రాజా! ఇట్టిదుర్బుద్ధి నీకుండుటచేతనే భగవంతుఁడు. నిన్ను వనవాసిగ జేసినాఁడు. మంచివాఁడవైనచో బ్రాహ్మణుఁడను. ఆకలి బాధచేఁ గడుపు దహించుకొని పోవుచుండ, వచ్చియడుగ - విషఫలమని బొంకకుండ నాక్షణమునందే యిచ్చియుందువు. వన్యఫలమునకే యిట్లు బద్ధములాడినవాఁడవు. తక్కిన రాజకార్యములయందెట్లు వర్తించితివోకదా? ఇంకనెప్పుడును నసత్య ప్రధానచేతస్కుఁడవుగాకుము.

నలు—పృథ్వీసురోత్తమా! నీవు నాచిత్తవృత్తి నరయఁజాలక యట్లుపలుకుచుంటివి పోనిమ్ము; నీక్షుధ తీరినదికదా; నాకదియే భాగ్యము. నాయందు దయ

యుంచి, యీయరణ్యమునుండి మేము వెలువడ యేదేని పురముఁ జేరుదారి తెలుపుము.

బ్రాహ్మ—ఛీ! నీకు దారిఁ జెప్పవలయునా?

మ. నరపాలుండవె నీవు భూమిసురయి చం । డాలుండవే గాక! భూ
సురు డొక్కండిటు లాకటన్ జనుచు ని । చ్చో జేర వానిం గృపా
పరతన్ జూచి ఫలంబు నీయకయె దు । ర్భావుండవైనట్టి దు
శ్చరితున్ నిన్ను మొగంబు జూడఁ బాపమొదవున్ । క్ష్మాపాల వంశాధమా.

పొమ్ము. పొమ్ము. (నిష్క్రమించును)

నలు.—రమణీ! కాలగతి యెట్లున్నదో యరసితివా?

తే. గీ. విషఫలంబేమొ యంచును । వెఱ్ఱినగుచు
నట్టు పల్కిన నాచిత్త । మరయలేక
యవనిదేవుఁడు కోపించి । యరగినాఁడు
కాలవైపరీత్యంబును । గంటె యబల!

ఉ. ఆకలిబాధకంటె విను । మా కలిబాధయె యెక్కువయ్యెనో
ప్రాకట చంద్రబింబముఖ !

దమ.— । పార్థివ చంద్రమా! యేమిసేతు న
య్యో కడుపెల్ల మండెడు మ । హోజ్జ్వల ఘోర దవానలంబుగా
నేకరణిన్ భయంకరాటవిని । నేను సహింతును దీనిఁ జెప్పుమా ?

(రెండు పక్షులు పైనుండి వచ్చును.)

నలు.—తరుణీ! అటు చూడుము. ఏవో రెండుపక్షులీవృక్షము క్రిందకు వచ్చుచున్నవి. ఎట్లయినను వీనిం బట్టుకొని యాహారముగా నుపయోగింతము. ఈ వుత్తరీయము వానిపై వేసి పట్టుకొందును.

(పక్షులను బట్టుకొనుటకు వలువ నెగరవేయ నవి వసనము హరించును)

దమ.—నాథా! ఈచిత్రమున కేమందును?

నలు.—మనోహరీ !

తే. గీ. కాలకర్మగతికి నిట్లు । గరిత! యెద్ది
వలయుఁగాక! గాకున్నచోఁ । బక్షిఁ బట్ట



వలువ నెగరవేయంగ న । ప్పక్షులేమి
వసనము హరించుటేమి, దు । ర్భరము కాదె.

దమ.—నాథా! యిదియంతయు మనపురాకృత ప్రారబ్ధము. విచారించి నందువలనఁ బ్రయోజనము లేదు. నావలువయే మన యిరువురమును ధరింతముగాక. కాలము తెప్పివచ్చినప్పు డెవ్వరేమి చేయఁగలరు? ఇన్నినీళ్లయిన నెక్కడనేని లభించునేమో యరయుదము. నెమ్మదిగా రమ్ము. (నిష్క్రమింతురు)

(పునఃప్రవేశము— కలి)

కలి—(తనలో) తనకవసరములేని కార్యములీ యిందుఁ డేల నెత్తిపైఁ బెట్టుకొనవలయును. నల దమయంతులకు ఆకలి తీరినఁ దనకేమి? తీరకున్నఁ దనకేమి? అందుకొఱకు చూతఫలము వారిముందు బడవేయునా? బ్రాహ్మణవేషమున దానిని హరించితినిగాని అది వారు తిన్నచో నాకలి దప్పులడఁగియే యుండును కదా! కానిమ్ము. ఇఁక నల దమయంతులను వేఱు వేఱు త్రోవలఁ బట్టించెదఁగాక! కలిప్రభావము పాకశాసనుఁడు గ్రహించుఁగాక! (నిష్క్రమించును)

రంగము— [అరణ్యము-నల దమయంతులు ఏకవసనము ధరించి ప్రవేశము]

నలు— తే. గీ. కంటకోపేతమైన యి । క్కాన నెల్లఁ
దిరుగుటం జేసి యాయాస । భరము హెచ్చె
గాని సలిల మెచ్చటనైనఁ । గానఁబడదు
కాలగతి యిట్టులున్నది । కంజనేత్రి!

దమ—ప్రాణేశ్వరా!

తే. గీ. సన్న సన్నగ బలమెల్ల । జారిపోయె
జగము సకలంబు దిరిగెడు । సరణిఁదోఁచె
నుండునో ప్రాణ ముండదో । యుర్వినాథ
కదలఁజాలను నడుగైనఁ । గానఁ గోన.

నలు—దమయంతీ ! మనకెట్టిదురవస్థ సంభవించినది. అదియేమి కాలమహిమయో? లేక భగవంతుఁడు బుద్ధిపూర్వకముగ మనకిట్టి చిలుగుల కల్పింపఁదలంచెనో? జలముచేనైనఁ గడుపునింపుకొందమన్న నొక్కజలాశయమైనను గానిపింపక యున్నది.

దమ—భగవంతుఁడు మనయెడఁ బరాఙ్ముఖుఁడై యున్నాఁడు. అయ్యో! అడుగు ముందుకు బడకయున్నది. పాదములు తేలిపోవుచున్నవి.

నలు—రమణీ! అల్లదే మనకెదురుగ నొక జలాశయము కనిపించుచున్నది ఎట్లో యోపికఁ బట్టి నాలుగడుగులు వేయుము. కడుపునిండ నీరములు గ్రోలి తత్తీరమున వృక్షము క్రింద విశ్రమింతము, లెమ్ము (చేయిఁబట్టుకొనును)

దమ—అట్టే! (ఇరువురును కొంతదూరము నడిచి కాసారమునదిగి నీరములు ద్రావుదురు.)

నలు—నారీమణీ! నేఁడు మనకీజలములే పంచభక్ష్యయుతమైన సరసరసాన్నమయ్యెఁగదా?

దమ—నాథా! ఆయాసమధికముగ నున్నది.

నలు—ఇక్కింతకాలము నాయంకపీఠిని శిరమిడి నిద్రింపుము.

దమ—(అట్లు చేయును)

నలు—ఉ. విశ్వసుతాత్మయీసతి ప । విత్రచరిత్రలతాంగి భీమరా
జేశ్వరుకూర్మిపుత్రిక య । హీనగుణాఢ్య; సగర్వశాత్రవా
నుశ్వసనోరగేంద్రుఁడయి । శోభిలునీనళరాజచంద్రుచి
త్తేశ్వరియైన యిందుముఖి । యిప్పుని నిద్రను బొందెనక్కటా.

హా దమయంతీ! నామూలముననఁగదా నీవిట్టి సంకటంబులఁ బొందుచుంటివి. సతీమణీ! పుట్టినింటికిఁ బొమ్ము, నాతో కష్టములనందఁ జాలవని యెంత బ్రతిమాలి చెప్పినను వినక, వచ్చితివి. అక్కటా! తలోదరీ! శుద్ధాంత సౌధంబులయందు పరిచారికా సహస్రంబులు సురటీలువీవ హంసతూలికా తల్పమున శయనించు నీవు; ఆర్యభక్తి మంతుఁడును. రాజర్షి యనందగిన వాఁడును భీమరాజేంద్రునకు దమనమునీంద్రుని యనుగ్రహమున గలిగిన నీవు; సద్యశ్శోవృతాశావటలుండును, సప్తపయోనిధి వేల్లితాఖిల ద్వీపనృపాలమౌళి వినతి స్ఫురణార్హ పదాబ్జుఁడైన యీనలుని మనసారఁ గోరి వరించిన నీవు; నేఁడు, ఈ, గజగవయగండభేరుండ గండక కంఠీరవ వ్యాఘ్రాచ్ఛ భల్లశరభ సైరిభస్తబ్ధరోమమృగాధ వాధ మహావన జంతు సంతానాకుంఠిత కంఠకు హారళోద్రవనిర్గత కూర్పర నిర్ఘోషణ భీషణాంబును, పిశాచగణ విహారాండబరదంతురంబును, జంబు జంబీర నింబతరుస్యందన మందారకందరాల పలాశన్యగ్రోధ మా లూరాశ్వత్థాది వసుధారుహ శకటలాభ్రంకషంబును, నిశాతస్థూల కంటక పా



షాణశ్రేణి వ్యావృతంబును, కలరవఖంజరీటశ్యేనచటకకరట కలకంఠ ప్రముఖనిఖిల ఖగకుల కల కలధ్వాన సంకులంబును, నై యొప్పుచు దినేశరుచులు జొరనీక చీకటులు గ్రమ్ముకొని యినుక సల్లిన రాలకుండ బరిక, చిట్రిగుగచ్ఛకసింద కోరిం దకంపల గలయంబెనుచుకొని, తెరపరయు పశంబుగానీక యల్లికల బెల్లిఅకటంబై దురవగాహాస్థితి నతిశయిల్లు నిమ్మహారణ్యమున ఈవృక్షమునీడను కటికనేలను శయనించుచుంటివికదా!

సీ, అడుగేనిఁ బెట్ట శ । క్యముగాని యిమ్మహా
రణ్యంబు మణిమంది । రంబె నీకు
కడుభీతి గలిగించు । కానన మృగములు
ఘనపరిచారికా । జనులె నీకు
కడుపుమంటను ద్రావు । కొలంజలంబులు
సరసభక్ష్యాన్నభో । జ్యంబె నీకు
కఠిన శిలాయుక్త । కంటక భూమియే
బహు సౌఖ్యమిచ్చు త । ల్పంబె నీకు;

తే. గీ. కటకటా యెట్టి ఘోర సం । కటముగలిగె
నాకతంబున భీమభూ । నాథపుత్రి!
జలజసన్నిభ నేత్రి! ప । ల్లవగాత్రి!
సుజనసన్నుతచారిత్రి! । సుందరాంగి!

నీకడగండ్లను నేను వీక్షింపఁజాలను. పరితాపము నాపుకొనఁజాలను. కావున నిన్ను నేను విడిచెదను. అట్లు చేసినచో నీయవస్థ నేను జూడక యుందును. నీవైన నెందైన జేరి సుఖింపఁగలవు. (చీర సగము జించి) అక్కటా! నేనెట్టిసాహసకార్యముఁ జేయఁ దలఁచితిని. స్వయంవరమునకుఁ బూర్వము దేవేంద్రునంతటివాఁడు తన్ను వరింపుమని సందేశము బంపినను నంగీకరింపక, నలునిఁదప్ప నన్యుని నొల్లనని వచించిన సుశీలయగు దమయంతిని; ఒక్కనిముసమైన నిన్నెడబాసియుండనని పలికి, సకలరాజ్యశ్రీలబాసి యరణ్యమునకుఁ గట్టుఁబట్టతో నావెంట వచ్చిన నాదమయంతిని; నాపైన నున్న ప్రేమచేఁ గన్నకొడుకును సహితము కన్నవారియింటికిఁ బంపిన దమయంతిని; యెట్టి యాపదలెట్టి దుఃఖము కలిగినను యూరడింపు వాక్యములచే నాకు ధైర్యమిచ్చు దమయంతిని; అయ్యో! ఈఘోరారణ్యమున విడిచిపోవుదునా? ఇట్టిసా

హనకార్య మాచరించితి నేని, నాసుశీలతకు, నాధర్మసంధతకు, నాపురుషార్థమునకు నావిజ్ఞానమునకు, నాసత్కార్యాచరణమునకు భంగము కాదా ? నాయాత్మ తిరుగ విముక్తిని బొందనటువంటి ఘోరనరక కూపమునఁ బడదా ? నేనిట్టి దుష్కృత్యము ను జేయఁజాల. సేయకున్న నెట్లు ఘోరారణ్యమున నాకలిదప్పులకు గృశించుచుండు నీమె నెట్లు చూడగలను, ఏమైనను సరే ! ఎడబాసిపోయెదఁగాక! హా! నలా! కఠిన కర్మా ! అగ్నిముఖమునఁ గైకొనిన యర్థాంగిని. యీరీతినట్టడవిని విడిచిపోఁ దలఁచితివా ? నలుఁడు క్రూరకర్ముఁ డనుజననిందను బొందఁ దలంచితివా ? (ఆలోచించి) జననిందతో నాకు బనిలేదు. లోకముతో నాకవసరములేదు. నాయర్థాంగి- నామనోహారిణి- నాసంతోషమున కాలవాలము- అగు నీదమయంతికి సౌఖ్యము గలుగుటయే నాకుఁ గావలసినది. నేనీమెను విడిచిపోవుదునేని యీమెకు దప్పక సౌఖ్యము కలుగగలదు. దమయంతీ! ఇట్టి దుష్కార్యము నేఁ జేయుచున్న నీప్రాణేశ్వరుని క్రూరకర్ముఁడని నిందింపకుము. కృపారసహీనుఁడని దెగడకుము. నీసౌఖ్యమును గోరియే నేనిట్టి పనిసేయుచుంటిని. కాకున్నచో నెన్నఁడైన నిన్ను బాసియుందునా ! ఈలేఁడు నిర్దయుఁడు గాడని యెఱుంగుము. (పూర్తిగా జీరచించి కదలకుండ దమయంతి శిరమును తన తొడనుండి తీసి కొంచెము దూరముపోయి) హా! నాదియెంత కఠినచిత్తము. ఈలేమను విడిచి పోవుచుంటినే! ఈపల్లవాధరిని విడువవలసినదేనా? (మరల దమయంతి యొద్దకు వచ్చి కూర్చుని) హా ! దమయంతీ! సంపూర్ణపూర్ణిమాచంద్రమండలంబును ధిక్కరించు నీముఖపద్మమును జూచుచు ననుదినంబును సంతోషముఁ బొందితిని. గాని విచార మెన్నఁడును నెఱుంగను. రమణీయమహోద్యానవనారామ సీమలయందు నిరంతము నీతోఁ గూడి విహరించి మోదమందితిని గాని, యొకనాఁడును నినుఁ బాసియెఱుంగను. నీయందున్న యనురాగమున నీవెద్ది కోరిన నది యొసంగి సంతోష మందితిని గాని, యిట్లు కఠినాత్ముఁడనై నట్టడవిని నిన్ను బాయు కఠిన కర్ముఁడనగుదునని యెన్నఁడును తలంపనైతిని. శర్కరాద్రాక్షారసముల కంటె మధురతరమై యలరారు నీముఖపద్మమును ముద్దుపెట్టికొని సంతతానంద వారాసినోలలాడితిని గాని యెన్నఁడును వగచి యెఱుంగ- అక్కటా! నేటికిట్లు పెనువెత సంభవించినది.

దమ—(కదలుచున్నది)

నలు—అయ్యో! ఈమె మేల్కొనునా యేమి? మేల్కొనినచో నాయుద్యమము



విఫలంబగును. ఈమెను విడిచిపోఁదలంచినవాఁడను జాగు సేయ నేల? అక్కటా! ఈయబల మేల్కొని నన్నుఁ గానక, యిట్లు చేసినందులకు నెంతగా పరితాపమందునో కదా? ఏమైన నేమి. ఈమె సంతాపమును మాత్రము నేను చూడఁజాలను. అక్కటా! ఎట్టి సంతాపవార్ధియందు మునింగియున్నాను; నిమేషములో నెయ్యది యుద్ధరించునో, ప్రణయకలహసమయమున నెయ్యది సంపూర్ణ ప్రమోదముఁ గూర్చునో; ఎట్టి దుఃఖములను, నెట్టి యిక్కట్టులను నింతలో మఱపించి చిత్తమున నిశ్చలత్వమును స్థాపించునో; యట్టి ఈనారీమణి గాఢాలింగన సౌఖ్యమొకసారి యనుభవించి యరిగెదఁగాక! (కౌఁగిలించుకొనఁ బోయి) ఓహో! మఱచితిని. నేనీమెను కౌఁగిలించుకొంటినేని మేల్కొనఁగలదు. (ముద్దుపెట్టుకొని) ఒక్కసారి ముద్దుఁగొని పోయెదఁగాక! సర్వేందువదనా? నీకడగండ్లఁ జూడఁ జాలక నీమనోహరుఁడు నిన్నీయరణ్యమున నొంటరిగా విడిచిపోవుచు, ముద్దుఁగొనుచున్నాఁడు. మరల నీభాగ్యమునకుఁ బరమేశ్వరుఁడు త్వరలో ననుగ్రహించుఁగాక? ఓదేవతలారా! కోరి యీనైషధుని వరించిన యీదమయంతిని, మోహము పరిత్యజించి, యనురాగమును మఱచి, క్రూరాత్ముఁడై యీతఁడు యీయరణ్యమున విడచిపోవుచున్నాఁడు.

సీ॥ భీమనృపాలు । వెలలేని నోముల
        పంటయైపుట్టిన । పద్మగంధి
బృందారకుల మాట । వినకఁ బోఁద్రోచి
        నలరాజుఁ జేకొన్న । కలికిమిన్న
సద్గుణంబులయందు । సతిలోకమున కెల్ల
        దలమానికంబైన । తలిరుఁబోడి
పతిఁబాయగా లేక । సుతులఁ బుట్టింటికిఁ
        బంపివచ్చినయట్టి । వారిజాక్షి

తే. గీ. అట్టి దమయంతి నీయర । ణ్యంబునందు
వదలిచనుచుంటిఁ గావునఁ । బరమకరుణ
సరసి, రక్షింపఁ బూనుఁడీ । యమరులార
వనజబాంధవశశులార । భవ్యులార,

(నిష్క్రమించును)

దమ—(లేచి) నాథా ! నాథా ! ఏమిది పలుకవు. (కన్నులు తెఱచిచూచి) ఏడీ ! నామనోహరుఁడు. నారాజచంద్రుఁడగునళభూపాలగ్రామణి ! నాథా ! ప్రాణనాథా ! ఇంకెక్కడిప్రాణనాథుఁడు. ఈనట్టడవిని నన్నువిడచి తనమార్గముఁ దాను జూచుకొన్నాఁడు. ఈసతి హృదయము బరీక్షింపఁదలఁచి యెచ్చోటనైన డాగితివా ? నాథా ! నీవు నన్నిట్టి పరీక్ష సేయనవసరము లేదు. ఈకాంతమనోవాక్కాయకర్మములయందు నిన్నే నమ్మియున్నది. నీపాదారవిందసేవతప్ప యన్యచింతనమవసరము లేదు. (మరల పిలచుచు) ప్రాణేశ్వరా! రమ్మురమ్ము. నీపరీక్ష యిఁకచాలును. (ఇంచుకయూరకుండి) నిజముగా నన్ను విడచియరగితివి. మనోహరా ! నీవిట్లు సేయుటకు నేనేమి మహాపరాధముఁగావించితిని. నాయగచాట్లు నీవుచూడలేకపోయితివా? లేక నీకు నేను భారముగదోఁచితివా ? మార్గాయాసమునడస్సియున్న నీకు చరణసేవ సలుపకుండనీయింతిశరీరముమరచి నిద్రించినదని యాగ్రహించి యిట్లొనర్చితివా ? ఓజీవితేశ్వరా ! ఆకలిబాధచే ప్రాణములు శోషిల్లుటచేత నట్లు నిద్రించితినిగాని నీసేవచేయుట నాకు భారమా ? దేవా ! దమయంతి చిత్తవృత్తి నీకుఁ దెలియదా ?

సీ. నినుఁ బాయఁగా లేక । వనులకు నీవెంట
నరుదెంచుటైనను । నరయవలదె
నీమీఁదభక్తిచే । కామసుందరు బుత్రి
నెడ బాసియుండుట । నెంచవలదె
నీమీఁద ప్రేమచే । బృందారకులనైన
గొననొల్లకుండుట । గనఁగవలదె
యనిశంబు నీసేవ । లాచరించుచు పెద్ద
దినములగడపుట । దెలియవలదె
తే॥గీ॥ నాగుణంబు లెఱిఁగియుండి । నాథ ! యిట్లు
ఘోరకానలో నను బాసి । పోవనేల
భారమైతినె నీకంత । నేరమేమి
కరుణలేదేల సుందరా । కారనాథ.

ప్రాణేశ్వరా ! ఎట్టిసాహసకార్యము జేసితివి. నీవు నన్నీరీతిని నెడబాయుదువని కలయందైనఁ దలంపనైతినిగదా ! అక్కటా! నేను పాపినిగాకున్నచో నేఁడు నాకీనిద్రయేలరావలయును. నేను మేల్కొనియుంటినేని నీవు నన్ను బాయకయుందువుగదా?



ఒకవేళనట్టిదే సేయఁదలంచినను, గట్టిగ నీచరణములు బట్టుకొని బ్రతిమాలుకొనకయుందునా ? నీవెక్కడకు బోయిన నక్కడకు రాకయుందునా ? నాకిట్టిపాటుకలుగునా ? అగ్నిసాక్షిగ నేను నిన్ను గైకొనినదెందుకు ? కష్టసుఖములు నేనుగూడ సమముగ నీతోఁ బంచుకొనుటకు గాదే? అట్టిచో నన్నొంటిచేసి పోయితివేల ? అక్కటా ! కాలమహిమను బట్టి పక్షులను బట్టఁబోవ నవివసనముహరింప నిర్వురము నొకవస్త్రమునె ధరించితిమి. ఇప్పుడు నావస్త్రములో గొంచెము జించుకొని ధరించితివా అయ్యో ! ఎంతస్థితివచ్చినది. నామూలమున నీకు బాధలు సంప్రాప్తించుచున్నవని యిట్లుచేసియుందువని తలంచెదను. హా ! ప్రాణేశ్వరా ! ఇప్పుడు నేనేమి సేయుదును. నిన్ను నేను మరల నెట్లుచూడగలుగుదును? ఈయరణ్యమున నాకెవరు దిక్కు? ఎవ్వరిని వేఁడుకొందును. ఎవ్వరు రక్షింపగలరు. నన్నిట్లు దుఃఖసాగరమున ముంచివేసితివి. నేనిప్పు డెక్కడికి పోవుదును. నీవుయుండలేని యీవ్యర్థపుబ్రతుకుతో నాకేమిపనియున్నది. ఓవనమృగములారా ! నలుని బాసిన దమయంతి జీవింపఁజాలదు. కావునఁ గరుణించి నన్ను మ్రింగివేసి పుణ్యముగట్టుకొనుఁడు. హా! ప్రాణనాథా! నలసార్వభౌమా!

సీ. అనుకూలదాంపత్య । మనిసంతసించితి
యిట్టులౌనని యెన్నఁ । డెఱుఁగనైతి
కలనైన నినుఁ బాయఁ । దలఁపవంటినిగాని
యీరీతి విడచుట । నెంచనైతి
భవదీయ సేవయే । సర్వమంటినిగాని
యిట్టి పెన్వెతగల్గు । టెంచనైతి
నీదండ నుంటయే । మోదమంటినిగాని
యిట్టిదుఃఖముగల్గు । టెఱుఁగనైతి
తే॥గీ॥ హా ! మనోనాథ జితచంద్ర ! । హాసురూప!
హా ! నిరంతర కరుణామ । యాంతరంగ!
హా ! నృపాల పూజిత పదా । బ్జాత యుగళ!
హా ! మదీయమూలధనమా! । హా ! నిజేశ!

(మూర్ఛిల్లును.)

(తెరవాలును)

రంగము:—[అదేయడవి-ప్రవేశము నలుఁడు]

సీ. ననుబాసితే నాథ । యని శోకునై యెంత
కడుపులో దుఃఖంబు । గాంచినావొ
నిర్దయాత్మకుఁడయ్యొ । నేనాథుఁడంచును
నెంతగా ననుదూరి । యెగడినావొ
వనసీమలోనున్న । ఘనమృగంబులఁజూచి
పరమభీతిని నెట్లు । బాఁటినావొ
దిక్కునాకేమంచు । ధీరత విడనాడి
యేరీతిగావింప । నెంచినావొ
తే।గీ। హా ! సతీమణి ! చంద్రబిం । బాస్య భీమ
భూధవసుపుత్రి ! సుమగాత్రి । భూరిదుఃఖ
వార్ధిముంచితినిన్ను లా । వణ్యసీమ
యుండఁగలనే నిన్నుఁ జూడ । కుండ నేను.

మ। కలికీ కన్నులపండువై లలితమై । కల్యాణ సంధామమై
లలితానంద విశేషదాయకమునై । లక్ష్మీవిలాసంబునై
వరుచందంబుల సమ్మదావహమునై । భాసిల్లు నీదివ్యమం
గళరూపంబిఁకఁ జూడగాగలుగు భా । గ్యంబున్నదే ధారుణిన్.

సతీమణీ ! నేను నీయెడల నెంతకఠినచిత్తుఁడనైతిని. నాయట్టిపాపాత్ముఁడెందైన గలఁడా? నలునేవరించెదనుగాని యొరులవరింపనని దీక్షవహించి, గుణపరీక్షకై బృందారకులు తమ్మువరింపుమని పంపినసందేశమును నిరాకరించి, తుదకు మనోరథసిద్ధవై- యెన్నడును నన్నుబాసియుండనని- యరణ్యములకువచ్చిననిన్ను నట్టడవిని బాసివచ్చితినిగదా? అక్కటా ! ఇప్పుడునిన్ను నేనెట్లుచూడగలను? నీవునాకుమరల గనుపింతువా ? హా! దమయంతీ ! నీవునాకై యరణ్యంబున నెంతగా నన్వేషించుచున్నావో ? నన్ను బాసికొంతదూరమువచ్చి, -చేసిన క్రూరకర్మమునకుఁ బశ్చాత్తాపమునంది - మరల నీవు గనుపింతువేమోయని వెనుకకువచ్చితినిగాని:— ఈపాపచారిత్రునకు నీవు గానిపింపవైతివి. అయ్యో! ఇప్పుడెందుంటివి ?

(లోపలనగ్ని కనిపించును)

ఈదావానలమేమి? అరణ్యమంతయు జుట్టుకొనుచున్నదే? ఈయగ్నింబడి ప్రాణముల విడిచితినేని యీయవస్థలన్నియు గట్టెక్కునుగదా?



(లోపలధ్వని)

మాంపాహి - మాంపాహి - మాంరక్ష - మాంరక్ష.

నలు—ఎవ్వరిట్లు పలుకుచున్నవారు. (ఎదుటఁజూచుచు) అయ్యో ! నీవెవ్వరవు ? నావలెనే నీవుగూడ కష్టసాగరమున మునిఁగితివా ? అయిననేమి ! భయపడకుము. ఎట్టిస్థితియందున్నను నలుఁడాశ్రితజనరక్షణదీక్షాబద్ధకంకణుఁడని యెఱుంగుము. సత్వరముగ నీకు వచ్చినయాపద తెలుపుమయ్యా.

(లోపల)

నలరాజా! నీకుశుభమగుఁగాక! నేనొక సర్పరాజును. మహా[illegible]ను. అగ్నిలోబడితిని. రక్షించి పుణ్యముగట్టుకొనుము.

నలు—(విక్రమించి- అగ్నిలోనున్న సర్పమును నీవలకుదెచ్చి) నాగరాజా! నీకీ ప్రాణభీతి పోయినదికదా? (అని క్రిందవిడువనదికఱచును) హా! (రూపము మారును) అక్కటా! ఇదియేమి? ఉపకారమునకు నపకారము వెంట వచ్చెనే? నడుకానయందు నర్థాంగిని నావిధి బాసివచ్చినఫలము కట్టికుడుపక యుండునా? ఆహా! ఇమ్మహారణ్యములో తుదకు సర్పదష్టుఁడనై మరణమందుమని ధాత నాముఖంబున వ్రాసెఁగాబోలు! (దమయంతి నుద్దేశించి)

తే. గీ. ప్రాణభీతిని బాము కా । పాడుమనుచు
గోరరక్షించి మించితిఁ । గుంజరదన
నందుకీడు నాకు నం । ప్రాప్తమయ్యె.
నూరడింపఁగ రావ! వి । ద్యుల్లతాంగి.

నాయనా! ఇంద్రసేనా! నీవెక్కడనుంటివోయి? తల్లిదండ్రులపై నెట్లు బెంగఁగొని యుంటివోకదా? ఎట్టిదుఃఖసమయమునైనను నీసుందరవదనారవిందమును జూచుటచేత, నీమృదుమధురసంభాషణములు వినుటచేత, నీబాల్యక్రీడలఁజూచుటచేత నదియంతయు మఱచియుందునే తండ్రీ! ఇట్టిసమయమున నాదండ నెవ్వరును లేరుకదా ! అయ్యయ్యో! ఈసర్పము కఱచుటేమి! ఈరూపము మాఱుటేమి! హా? పరమేశ్వరా! ఈనలునియందింత నిర్దయవహించితివేల ! స్వామీ! నీచర్యలతివిచిత్రములే.

మ. ధరణీరాజ్యము బాయఁజేసితివి నా । తన్వంగినింబాపి, భీ
కరఘోరాటవిఁ జిక్కఁజేసితివి, యు । గ్రక్రూరసర్పంబునన్

గలవం జేసి విరూపుఁ జేసితివి నీ కారుణ్యమిట్లున్న న
వ్వరిఁ బ్రార్థింతును బ్రోచువారెవరు దేవా! సర్వములోకప్రభూ.

నీకైనను దయరాదా! కాలగతి చాలనప్పుడు నీకుమాత్రము దయవచ్చునా? దుర్భరపరితాపవశమున నిట్లు పలుకుదును గాక, ఎవరు చేసినకర్మము వారనుభవింపక తప్పునా? (సర్పమును నుద్దేశించి) వృద్ధుఁడవగునో నాగరాజా! నేను నీకుపకారము చేయ నీవు నాకిట్లు చేసితివి. గ్రహబలము చాలకున్న నిట్లేయగును గదా?

(ప్రవేశము - కర్కోటకుఁడు)

కర్కో—

మ. అవనీపాలక చింతఁబొందగను నేలా! యిట్టులన్ వారి జో
ద్యవుఁడే భంగిని వ్రాసెనో యటులె తథ్యంబొప్పగానౌను, నీ
వు విచారించిన లాభమేమి! సుఖమే బొల్పారఁగాఁ గోరి, మా
నవుఁడశ్రాంతము దానినేగనుమ ఘం నాథాగ్రణీ! ధీమణీ.

ఏను కర్కోటకుఁడ. కలియాజ్ఞ ననుసరించి నిన్నుఁ గఱచితిని. అతని యాజ్ఞ యనుల్లంఘనీయము. దేవేంద్రుఁ డింతకుమున్నె మీ కాకలిదప్పు లడఁగుటకు చూతఫలమొకటి మీ ముందుబడవైచినాఁడు. అది మీరు భుజించియున్నచో నాకలిదప్పులు లేక జ[illegible]వ్యములకు గొడవలేకయుండెడివారే? కాని కలిరాజు వృద్ధబ్రాహ్మణవేషమున నాఫలమును హరించినాఁడు. ఇప్పుడు నేను నిన్నుఁ గఱచితినని విచారమందవలదు. దేవేంద్రుఁడు నీయెడలఁ గరుణించి నా విషమున నమృతముంచుటచే నీకు బ్రాణహాని లేదు. అందులకనే రూపము మాఱితివి. ఆకలిదప్పులు నీయధీనమైయుండును.

నలు—కర్కోటకా! కలిరాజు నాయెడల నింతనిర్దయ వహించినాఁడేమి?

కర్కో—అనవసరమైన ప్రశ్నల నడుగవలదు.

నలు—నాదమయంతిజాడ నేమైనఁ జెప్పగలవా?

కర్కో—ఇట్టివన్నియు నేను చెప్పను.

నలు—పోనిమ్ము. ఎప్పటికైన నాదమయంతిని జూడఁగందునా?

కర్కో—నాకుతెలియదు - పోవలె - (కొంచెము ముందుకుఁబోయి మరల వెనుకకు వచ్చి) నలరాజా! నీకు నిజరూపము గావలసినప్పుడు నన్ను స్మరించితివేని యొకదివ్యాంబరము పంపెదను. దానం జేసి నిజరూపమును బొందఁగలవు.

(నిష్క్రమించును)



నలు—అయ్యో! నారూపమున్ననేమి! పోయిననేమి! ఎవ్వరుచూచి సంతసింతురు. నాదమయంతి లేకున్న నిదియంతయు నాకేల! అక్కటా! తన్ను విడిచివచ్చితినని యాతన్వీమణి ప్రాణములపై రోసి యేదైన సాహసకార్యముఁ జేసియుండదుకదా? లేక యేవన్యమృగములైన క్రూరకార్యము గావించియుండునా? క్రూరకర్ముఁడనై తొలుత నట్టి యకార్యమాచరించి యిప్పుడిట్లు విచారించుచుంటిని.

మ. తరుణిం బాసి యిటేలవచ్చితినయో తద్వక్త్రమీక్షింపుచా
నరసన్ వర్తిలుచున్న నా చెలికటాక్షస్ఫూర్తి శోభిల్లన
ర్మరతిన్ నన్నొకసారి గాంచినవెనన్ మన్మానసాలీఢదు
ర్భరతాపంబొకయింత దీరునుగదా రాజెల్లునే వ్రేల్చినై.

అయ్యో! ఆమెను విడచివచ్చినతరువాత!

చ. ఘనకచదర్శనంబునకుఁ గన్మలనేగుట కార్యమంచు నే
ననుకొనినట్లె నాహృదయ మందొక కోరిక నేర్పరించి యా
వనితనుజూడఁబోవ బల వంతముఁ జేసె విధాతగాని య
వ్వనజముఖీశిరోమణిక సంబడదయ్యె వనంబులోపలన్.

ఓవనదేవతలారా! మీరేమయిన నాదమయంతిజాడఁ దెలుపఁగలరా?

మ. శరదిందుప్రతిమాన బింబవదనన్ శాతోదరిన్ సుందరిన్
సరసీజాక్షిని; గంబుసన్నిభగళన్ జక్రస్తనిన్; జారుసుం
దరగాత్రిన్ దమయంతి నీయడవిలో నన్ జూచియున్నారె న
త్కరుణన్ దెల్పుఁడు మీకు మ్రొక్కెద నమ త్వద్భక్తి రాజిల్లఁగన్.

(అనుబంధము 12) (నిష్క్రమించును)

---

రంగము [అరణ్యము - వీరనాయకుఁడు మొదలగు చెంచువారు]

వీర—ఏమిరా! వేటకు జాగిలములన్నియు తెచ్చితిరా?

1. ఎఱు—ఎకిమీఁడా! అన్నియుఁ దెచ్చినాము. ఈరోజున వేట బహునిపుణతతో సమర్థించవలయును.

2. నీవచూచెదవుగాక! నిబ్బరంబైన గబ్బిదెబ్బులుల నిబ్బరంబుగ నేలను బడద్రొబ్బినీవబ్బుర బడనీదుబ్బుకొని వచ్చెదను.

వీర—సరే. మీరుపోయి మీకార్యములందు వర్తింపుఁడు. నేనిందే యుందును.

(చెంచువారు - నిష్క్రమింతురు.)

(ప్రవేశము - దమయంతి)

దమ—

సీ. మగువవైయున్న నీ । మహితానురాగంబు
మఱచిపోయితి వేల । మాన్యచరిత
సతతరంబునను గూడి । సంచరించెడు ప్రేమ
విడనాడితి వదేల । పుడమిపాల
ననుఁగట్టిపైచు నీ । నవ్యమోహామునిట్లు
బాయఁగల్గితి వేల । పార్థివేంద్ర
యాశ్రితావనదీక్ష । యబలపైఁ జూపక
తనరారితి వదేల । ధర్మమూర్తి

తే. గీ. యక్కటా నీదు యర్ధాంగి । నైన నన్ను
గరుణఁజూడంగ రావేల । త్వరితగతిని
హా మనోనాథ! జితచంద్ర । హా! సురూప
సరస కారుణ్యగుణసీమ । సార్వభౌమ.

హా! ప్రాణేశ్వరా! ఎన్నఁడును నిన్నుఁ బాసియుండనని పలికితి వే? నీవంటి మహనీయుఁడనృతమాడవచ్చునా? (ఇంచుకయూరకుండి) అక్కటా! నాకీదుఃఖమెట్లు తీరునుఁ? ఓవనమృగములారా! మీరైనను నన్నుఁజంపివేసి పుణ్యము గట్టుకొనుఁడు. లేదా నా ప్రాణేశ్వరునిఁజూపుఁడు - (ఇంచుక నడువగా - నొకపాము దమయంతి పాదముల ముందునకువచ్చును) హా! ఇఁక నేమున్నది. నేఁడు నాకీ సర్పముచే మరణమున్నది హా! నాథా! నలసార్వభౌమా! నీయబలప్రాణమును రక్షింపరావా?

వీర—ఓహో! ఈమెయెవ్వరో సర్పమునకు భయపడినది. నేనీపామునుజంపి యీమెను రక్షించెదను. (ఖడ్గముచే బామునుజంపును)

దమ—అయ్యా! నీవు నాపాలిటికి నేఁడు దైవంబవై ప్రాణముల రక్షించితివి. నీ యుపకారమునకు నేనేమియుఁ బ్రత్యుపకారము కాలపరిస్థితినిబట్టి చేయఁజాలను. భగవంతుఁడు నిన్ను రక్షించుగాకయని వేడుకొందును.



వీర—నన్నుఁ బొగడెదవేల ? నేనేమిచేసితిని ?

దమ—నాయనా! ఇంతకన్న నాకుఁగావలసిన దేమున్నది ?

వీర—సరే; కాని నీవెవ్వరవు ?

దమ—ప్రాణదాతా! నలునిభార్యను దమయంతిని. ఇరువురము కలిప్రేరణమున రాజ్యము వాసి యరణ్యమునకువచ్చితిమి. విధివశమున నేనాతనినిం బాసి యిట్లొంటరి నైతిని. తండ్రీ! నీవెవ్వరవు ?

వీర—నేనా! వీరనాయకుఁడను చెంచురాజును. ఏమీ! నీవు పతినిబాసియుంటివా ? అతఁడు నిన్నుబాసినాడా ? నీవాతనినిఁ బాసితివా ?

దమ—(ఊరకుండును.)

వీర—మాటాడవేమి ? సిగ్గాయేమి ? పోనిమ్ము. రా! మనయింటికిఁబోదము. నీకు తక్కువ యేమియునుండదు.

దమ—వీరనాయకా! నామనోహరుని నేనుజూడవలయును. అంతపర్యంతము నేను భుజింపను. నీరముఁగ్రోలను. ఒకరి గృహమునకు రాను.

వీర—నీవు వట్టి వెఱ్ఱిదానవు. ఏమిటీ! అడవిలో నిన్నువదలివెళ్లిన మగనికొఱకు నింతగా యాయాసమందుచుంటివి.

దమ—తండ్రీ! మా యనురాగము నీకుఁ దెలియక యట్లు పలుకుచుంటివి.

వీర—చూడుము! మఱియొకవిధమున నాలోచింపవలెను. నిన్ను జూచినప్పటినుండి దిక్కుమాలిన పువ్వులవిలుకాఁడు - అబ్బా! దమయంతీ! నామీఁదస్వారి చేయుచున్నాఁడు. నీ దయయుంటే వానిగర్వము గ్రక్కించెదను.

దమ—హరీ! హరీ! ఎంతమాటఁ బల్కితివి తండ్రీ? నీవు ప్రాణదాతవు. తండ్రివంటివాఁడవు. అందులో నేనురాజపత్నిని. నీకుఁ దల్లినగుదును. ఇట్టికోరికఁ గోరఁదగునా ? నాయనా! అవివేకముచేనట్లు పలికితివి. నాయెడల మాతృభావము వహించి నీబుద్ధిని మరల్చుకొనుము.

వీర—ఎక్కడివరుసలో చెప్పెదవేమి ? నేనుపుత్రుఁడనేమి ? నీవు తల్లివేమి ? నేను సామాన్యుఁడననుకొంటివా యేమి? చూడు నాచక్కఁదనము. చెంచువారెల్ల నాకు సేవకులు. భార్యలా బహుమంది. నీవు నాయింటికివచ్చితివేని వారందఱిచే నీకూడిగము సేయించెదను. రాణివలెనుందువుగాక. లెమ్ము లెమ్ము. సంశయింపకుము.

దమ—నాయనా! నీదుర్బుద్ధిమానవా? (అనుబంధము 13)

వీర—బుద్ధిపుట్టినది. దమయంతీ! ఇఁక నేమైననుసరే, నీవే నాభార్యవు. నేను నీకు మగఁడను. బాగుగ నాలోచించుకొని నీయంతట నీవే నావెంట రమ్ము, లేదేని బలవంతముగనైనఁగొనిపోయెదను.

దమ—(తనలో) వీనిని భయపెట్టిచూచెదఁగాక. (ప్రకాశముగా) దురాత్మా! నన్ను బలవంతముగ గొనిపోయెదవా? బలవంతముగ సాధ్విని గొనిపోవుటకు నీకేకాక కాలరుద్రునికైన శక్యమగునా? జాజ్వల్యమానదావజ్వాల లశ్రమంబుగ హరింపఁజేయవచ్చును. కఠినసంజ్వరధుర్యకాకోలగుళికలు గుటుక్కున మ్రింగవచ్చును. నానాజగజ్జాలనాశనప్రక్రియోజ్జ్వల మృత్యువునైన గెలువవచ్చును. యముదోఃప్రకాండ దీవ్యచ్చండ దండంబులైనను విఱువవచ్చును. కాని పతివ్రతాగ్రహంబు గలిగించి యెవ్వఁడు జీవింపనోపును. నీవుబ్రతుకఁదలఁచిన వాఁడవేని నా తెరవునకు రాకుము.

వీర—అబ్బో! ఆడదానికే భీతిల్లుదునని తలంచితివా యేమి? ఇఁకఁ జూడుము. నా పౌరుషము (సమీపించుచున్నాఁడు) (అనుబంధము 14)

దమ—ఛీ! దుర్మతీ!

మ. తరుణిన్ గానను జిక్కఁగాయనుచుఁ జి । త్తంబందు నూహించి, దు
ష్కరుఁ డీతండిటు గోరుచుండెను నిఁకన్ । గారుణ్యమున్ బూనినన్
బరిరక్షింపఁగరావె, నీదు రమణిన్ । బాలింపవే వేగ యొ
క్కరుఁడున్ లేఁడు కృపన్ ననుంగను మనః । కాంతా! నిన్ వేఁడెదన్.

ప్రాణేశ్వరా! ఆశ్రితత్రాణపరాయణుండవు. దుర్జనశిక్షాదక్షుఁడవు పతివ్రతామానసంరక్షణుండవు అట్టిచో నిజాంగనను రక్షింపరావేల? సత్వరముగవచ్చి రక్షింపుము. (వీరనాయకునిఁ జూచి) ఓరీ! నీబుద్ధిమానవా?

వీర—ఆమాటఁ జెప్పవలదు.

దమ—కానిమ్ము. నీకు వినాశకాలము సమీపించినది.

ఉ. నారమణుండు సజ్జనగ । ణ స్తవనీయచరిత్రుఁ డేని, నే
నే రమణీశిరోమణిన । యేని హరిన్ భజియింతునేని, యీ
తీరున నన్ను, దుర్మతిని । తెంపరియై । గవయంగ నెంచు నీ
క్రూరకిరాతకుం డవనిఁ । గాలునుగాక మహాగ్ని దగ్ధుఁడై.

(వీరనాయకుఁడు దగ్ధుఁడగును)

(అవనిక పడును)



రంగము—(అయోధ్యలో-సభాస్థానము—ఋతుపర్ణుఁడు, వార్ష్ణేయుఁడు)

ఋతు—వార్ష్ణేయా! నీవింకను విచారమును విడువలేదుకదా?

వార్ష్ణే—రాజచంద్రా! చిరకాలము నలుని సేవించినవాఁడనగుటచే, నాతఁడు తలఁపునకు వచ్చినప్పుడెల్ల దుఃఖము కలుగుచుండును. ఇదియుఁ గాక! వారు కాననంబులకేగునప్పుడు నలకుమారుని నేనే భీమరాజగృహంబున విడిచి పెట్టుటకుఁ బోయితిని. బాలుండగు నాతఁడు తల్లిదండ్రులు రారేమియని యడిగిన మాటలు నాకు నిరంతరము జ్ఞప్తికి వచ్చుచుండును. (విచారించును)

ఋతు—వార్ష్ణేయా! ఊరడిల్లుము. విచారించిన లాభములేదు. నీవు నలునియొద్ద నెట్లుంటివో యట్లే నాయొద్దనుండుము. ఈదేహమునకు సుఖదుఃఖములు కావటికుండలవంటివి.

సేవ—(ప్రవేశించి) రాజేంద్రా! దేవరదర్శనార్థమై యెవ్వరో వచ్చియున్నారు.

ఋతు—శీఘ్రముగ రానిమ్ము.

(ప్రవేశము—రూపముమాఱిన నలుఁడు)

నలు—ఋతుపర్ణరాజర్షితిలకా! జయమగుఁగాక!

ఋతు—(తనలో) ఈతఁ డెవ్వఁడు? ఆకారము వికృతముగనున్నది. కాని తేజమపూర్వము. (ప్రకాశముగా) అయ్యా! నీవెవ్వరవు?

నలు—రాజదేవేంద్రా! అశ్వక్రీడయందు నాకుఁ గొంచెము నైపుణ్యముకలదు. అశ్వశిక్షగూడ నెఱుంగుదును. వంటయందుఁ గూడ నేర్పరిని.

ఋతు—అయ్యా! ఇంతకుముందు నీ వేనృపాలునినైనఁ గొల్చియుంటివా?

నలు—ఎక్కడ పని చేసియుంటినని చెప్పిననమ్ముదురు. అయినను నేను నళచక్రవర్తి యొద్ద నుంటిని.

ఋతు—నీనామము?

నలు—బాహుకుఁడు—దేవా! అమ్మహనీయుఁడు రాజ్యభ్రష్టుఁడైన నిట్లువచ్చితిని. విశేషదినములు నీకు శ్రమకలిగింపను.

మ. దివిజోర్వీసురభక్తికిన్ నెలవు, బు । ద్ధి ప్రౌఢికిన్ దావు, స
త్యవచోదీక్షకుమన్కిపట్టు, ఖల వి । ద్యావృద్ధికిన్ దావు, ధ
ర్మవిచారంబునకున్ నివాసము మ । హా మర్యాదకున్ ఱెంకి, యం
చు విశేషంబుగ నిన్ నుతింతురు జన । స్తోమంబు ధాత్రీశ్వరా.

నీయొద్దఁ గొన్నాళ్లుతలదాచుకొనుటకు వచ్చితిని.

ఋతు.—బాహుకా! నలరాజును సేవించినవారెల్ల నాకుఁబరమాప్తులు. వార్ష్ణేయా! నీవీతని నెఱుఁగుదువా?

వార్ష్ణే—(శంకయముతోఁ జూచుచు-తనలో) ఈతని నెప్పుడును నలుని యాస్థానమునఁ జూచియుండలేదు.

బాహు—వార్ష్ణేయా! నీవునన్ను మరచితివా? నేను నలరాజు పాకశాలకధికారినై యుండువాఁడనుకానా? నల దమయంతులకు వేడ్కగూర్పు పదార్థములు పచనము సేయుచునుండనా? నీతమ్ముఁడగు జయంతునకును నాకును మైత్రికాదా?

ఋతు—బాహుకా! నలుని నీవెన్ని సంవత్సరములు సేవించితివి?

బాహు—మాపూర్వులందఱునాతని యాస్థానముననే జీవించిరి. నేనును బాల్యమునుండియు నాతనినే సేవించితిని. దేవా!

తే. గీ. సత్యమంతయుఁ జెప్పితి । క్ష్మాతలేంద్ర!
యిష్టమైనను నీసేవ । నీయఁబడ్డ
కాకయుండిన బోయెదఁ । గాలగతిని
దూరుకొంచును దీనమం । దార భూజ.

ఋతు—సరి సరి! బాహుకా! ఎంతమాటంటివి. నీసేవనాకిష్టముగాక యుండునా? నలరాజువద్ద నెట్లుంటివో యట్లేనాయొద్దఁగూడనుండుము.

వార్ష్ణే—దేవా! ప్రొద్దుపోయినది,

ఋతు—ఇదిగో పోదము. బాహుకా! రమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)

—ఇది తృతీయాంకము—





—మంజులనైషధము—

# చిత్రనళీయము.

## చతుర్థాంకము

రంగము.-[అరణ్యము:-ఋషులయాశ్రమము:-బృహదశ్వుఁడు-మఱికొందఱు ఋషులు] (అనుబంధము 15)

బృహ—తే. గీ. తరుణి! దివ్యదృష్టిని నీదు । చరితమెల్ల
గంటిమీవు నిషధరాజు । కాంతవుగద
విధికృతంబున మీరలు । విపినభూమి
జేరి యుండిరి కాదె రా । జీవనయన.

ఇప్పుడు నీవు నీనాథుని నన్వేషించుచు వచ్చితివి కాదా?

దమ—తే. గీ. తాపసోత్తములౌ మీకు । ధరణియందు
దెలియని విశేషములు లెచట । గలవు; నేడు
మిమ్ము దర్శించుటం జేసి । నెమ్మనమున
గలిగె మోదంబు నాకు ని । ష్కలుషులార.

మీరు నుడివిన దానియందసత్యమావంతయు లేదు. కాని నాయెడల గరుణించి నాప్రార్థనవినుఁడు.

మ. నిరతంబున్ ననుసత్కృపారసమునన్ । వీక్షించు నాథుండు, భీ
కరఘోరాటవిలోన నన్విడిచె; నిం । కన్ గానమందే సం
చరణంబును సేయుచుండిన ప్రదే । శంబెద్దియోన్ జేరెనా
గురుకారుణ్యము బూని తెల్పుఁడిదె మీ । కున్ మ్రొక్కెదన్ దీననై.

బృహ—విధికృత మెవ్వరును దప్పింపఁజాలరు. ఈవిషయము లిన్నియు నేను చెప్పవలను పడదు. కాని నీమగనిని సర్పమొకటి కఱచినది. రూపుమాఱినది.

దమ—హా! (మూర్ఛిల్లును)

బృహ—అమ్మా! లెమ్ము.

దమ—(లేచి) మునీంద్రా! ఆతఁడిప్పుడెక్కడ నున్నాడు. మీకు మ్రొక్కెదను. చెప్పుడు.

బృహ—నీవు దీర్ఘసుమంగలి వగుదువు. (అంతర్ధానము నొందెదరు)

(తెరపడును.)

---

రంగము:-[అడవి-కొండలు సార్థవాహులు-ప్రవేశము]

(1) సార్థ—ఓరీ! సంధ్యపడుచున్నది. మన సామానును యిక్కడ బెట్టుకొని పడుకొందము.

(2) సార్థ—ఈప్రదేశము హాయిగనున్నది.

(దమయంతి—ప్రవేశము)

దమ—(తనలో) అరణ్యమంతయుగలయ వెదకితిని. మన్మనోహరుఁడుకనిపింపఁడయ్యె?

1 సార్థ—ఓరీ! ఇదేమిరా! పిశాచముకాదుకదా?

2 సార్థ—పిశాచముగాదు, గంగానమ్మ.

3 సార్థ—ఉండండి. అట్లుభయపడెదరేల—(దమయంతిని సమీపించి) తల్లీ నీవెవ్వరవు.

దమ—నాయనలారా! నేను నలునిభార్యను దమయంతిని. ఈయరణ్యమున నాథుని వెదకుచు వచ్చినదానను.

1 సార్థ—నలుని సంగతియంతయు విన్నాము. మాయజూదమున రాజ్యమోడి పోయినాడఁట.

దమ—నాయనా! మీదేయూరు.

1 సార్థ—చేదిపురము.

2 సార్థ—ఈరాత్రికిక్కడ విశ్రమించి తెల్లవారఝామున లేచి పోయెదము.

దమ—నన్నుఁగూడ చేదిపురమునకు దీసికొని పోయెదరా?

సార్థ—అభ్యంతరమేమి యున్నది. అమ్మా! నీవాప్రదేశమున బరుండుము. తెల్లతెల్లవారఝామున మేల్కొలిపెదము.

(సార్థవాహులు శయనింతురు)



దమ—తే. గీ. యురగమొక్కటి కఱువంగ । నుర్విధవుఁడు
రూపమును మాఱెనని తెల్పె । దాపనుండు
నడుగనైతినిఁ బైమాట । నంతలోన
మాయమైరి చోద్యంబుగా । మౌనులెల్ల,

తే. గీ. సర్పదష్టుఁడై యొప్పిన । సమయమందు
నింతినా నన్నుఁదలఁచి తా । నెట్లు దుఃఖ
మందెనో ప్రాణనాయకుఁడే । ముందు కాల
కర్మసంగతికి వగపుఁ । గాంచవలయు.

అక్కటా! నానాథుఁడు జీవించియుండెనో లేదో. (ఇంచుకయూరకుండి) మఱచితిని. ఆతాపసోత్తములు "నన్ను దీర్ఘసుమంగలీభవ" యని యాశీర్వదించిరికదా? దానంజేసి యాతఁడు సజీవుఁడై యుండెనని ధైర్యముకలదు. రూపము మారియున్న యాతని నెట్లు గుర్తింపఁగలను. అతఁడెక్కడ నున్నవాఁడో!

(ఏనుగులు ప్రవేశించి సార్థవాహులను ద్రొక్కును కొందఱీల్గుదురు. కొందఱు పరుగెత్తుదురు.)

దమ—(ఏనుగులనుజూచి)

తే. గీ. సజ్జనులనేల యీరీతిఁ । జంపజూతు
రేను నాథునింగానక । యీవనంబు
నందుఁ జరియించుచుంటి పా । పాత్మఁగాన
జంపుడీ నన్ను కృపనుగ । జంబులార.

సార్థ—అమ్మా! నీవు క్షేమముగ నున్నావా?

దమ—ఉన్నాను నాయనా! నాయట్టిదానికి మరణము రాదు.

సార్థ—అమ్మా! మనమీప్రదేశమునకుఁ బోయి యింకనొక్కగడియలో చేదిపురమునకుఁ బోవుదము. రమ్ము.

(నిష్క్రమించును)

---

[రంగము— చేదిపురమున విపులాదేవి యంతఃపురము—]

(విపులయు - దాసియుఁ బ్రవేశించుచున్నారు)

విపు—దాసీ! అదేమే! జనులందఱును వీధులవెంట నాతెఱఁగున బరుగెత్తుచున్నారు?

దాసి—ఏదియో వ్యాఘ్రమూరిపైఁబడెనఁట. అందుచేత అదిగో అది మనవీధినే వచ్చుచున్నది.

విపు—సరి సరి. దానికెదురుగ నెవరో యొక యువతిపోవుచున్నదే. ఆమెకు ప్రాణముపైన నాశలేదు కాఁబోలు! అయ్యయ్యో! చచ్చిపోవునా యేమి?

దాసి—అదిగో అటుచూడుము. ఆమెయెదుటకుఁ బోఁగానే వ్యాఘ్రము దానంతట నదియే తొలఁగిపోయినది.

విపు—చిత్రముగ నున్నదే? దాసీ! నీవుపోయి యామెనిటకు దోడ్కొనిరమ్ము.

దాసి—(నిష్క్రమించి వెంటనే దమయంతితో బ్రవేశించును)

విపు—తరుణీ! నీవెవ్వరవు? వ్యాఘ్రమునకెదురుగ బోయితివి. ప్రాణములపైన నీకాస లేదా యేమి?

దమ—[illegible] తల్లిరో! దైవవిధి దాటఁ । దరమె యేరి
కైనఁ వలయునన్నప్పుడీ । యవనియందు
చావు వచ్చునే దేహికి । స్వాంతమందు
వాంఛ కల్గినయంత లా । భంబు కలదె.

విపు—అమ్మా! నీవిట్లువైరాగ్య చిత్తవగుటకు నాకుఁగారణము గోచరముగాకయున్నది. నీవు మరణమును గోరుటకుఁ గారణమేమియున్నది? బ్రతుకుపైనింత రోత నీకేలకలిగెను.

దమ—తల్లీ! ఏమని చెప్పుదును.

తే. గీ. ప్రాణసముఁడైన భర్తను । బాసియిట్లు
దిక్కుమాలినదాననై । తిరుగు నాకు
ప్రాణమేల భోగంబేల । భాగ్యమేల
భర్త చెంగటలేని యీ । బ్రతుకు బ్రతుకె.

విపు—పతి నిన్ను విడచి యెచ్చటికైన నరిగినాఁడా?

దమ—అవును.

విపు—అట్లయిన నేనాతనిని వెదకించెదను. నీవు నాయొద్దనుండుము.

దమ—అమ్మా! నేను చందనము తీసెదను, పూలగుచ్చెదను. పురుషులను జూడను. ఉచ్ఛిష్టము భుజింపను.

విపు—నీయిష్టమువచ్చినయట్లుండ వచ్చును. రమ్ము.

(నిష్క్రమింతురు)

---



[రంగము:—(విపులాంతఃపురము, సైరంధ్రి యను పేరనున్న దమయంతి గంధముతీయుచున్నది]

దమ—(తనలో)

(అనుబంధము 16)

మ. సరసాలోకనహాస భాసురవిలా । సస్ఫూర్తిచేనొప్పు నం
దరమానాథుని నెమ్మొగంబెపుడు మో । దంబారగాఁగంటు, నీ
పరిచర్యల్ మతి దీరుచెప్పటికి నా । భాగ్యంపు నెప్పటి యీ
వరమూర్తిం దిలకించుటెప్పటికొ నా । భాగ్యంబికెట్లున్నదో

అక్కటా! నాకెప్పుడీ పరిచారకావృత్తివదలును! నాధైర్యము నాటికినాటికి తగ్గిపోవుచున్నది. గంధముతీయలేక చేతులు కందిపోవుచున్నవి! నానాథుఁడుయిది యెంతయు జూచి యేతెఱంగున విచారించునో కదా? (ఇంచుకయూరకుండి) అయ్యో! ఏమిది! నాథుఁడని కలవరించుచుంటినే? నాకట్టిభాగ్యమున్నదా? నానాథుని దివ్యమంగళవిగ్రహము నే నీజన్మమునఁ దిలకింపఁగలనా? అక్కటా! చేటీజనంబులు పదివేలమంది నిరంతరము సేవింపనలరారు నేను హా! కాలకర్మమున నొకరియింట దాసినై యుంటినిగదా? నామనోహరుఁడిదివిన్న నోర్వఁగలఁడా! ఇఁకెక్కడమనోహరుండు.

ఉ. నాథుఁడు నాథుఁడంచిటు మ । నంబునఁ జింతిలుచుందుగాని యా
నాథునిఁ జూచుభాగ్యమిఁక । నాకులభించును; లేదొ కాని, భూ
నాథునిపైన నాసయును । నాటికినాటికి దగ్గుచుండె నా
కీధర దాస్యముత్తియగు । నే; యిఁక నెప్పటికైనఁ జూడఁగన్.

(ప్రవేశము :—దాసి)

దాసి—సైరంధ్రీ! ఏమిచేయుచుంటివి. ఎప్పుడుచూచినను నెందులకో విచారించుచునేయుందువు.

సైరం—భగవంతుఁడు నన్నిట్లు సృష్టిచేసినాఁడు.

దాసి—నిండినయింటఁగూర్చుని యిట్లువిచారింపఁగూడదు. అది యమంగళము.-(ఇంచుకయూరకుండి) గంధముతీసితివా లేదా?

సైరం—ఇదిగో!

దాసి—(గంధపుగిన్నెఁజూచి) ఇదియేనా నీవుతీసినగంధము. ఉగ్గుగిన్నెడయిన లేదే!

దమ—చేతనైనంతవఱకు దీసితిని.

దాసి—ఒకరికి శరీరమమ్మినప్పుడిట్లు చెప్పుటమంచిదా; నీవెప్పుడును బరిచారికావృత్తి నెఱుంగవు కాఁబోలు! అదియంతయు నాకుఁ దెలియదు; నీవీగిన్నె నిండ గంధ మూఁదీయక పోయితివేని విపులాదేవితోఁ జెప్పి నిన్ను గృహమునుండి వెడల నడిపించెదను. తెలిసినదా ?

(నిష్క్రమించును)

సైరం—(తనలో)

తే. గీ. పండ్లచెట్టులముందర । ముండ్లకంచె
లట్లు; పనరుచుందురు జాణ । లైనచేటి
కాజనముగొప్పయింట నీ । కరణి వీరి
మెప్పువడయుటన్నను శక్య । మే తలంప.

ఔరా! ఈదాసి నన్నుఁ దృణప్రాయముగ భావించి యతినీచోక్తులాడుచున్నదికదా! ఎదిరించుటకు నాచిత్తము వెనుదీయుచు. ఎదిరించితినేని, చిరకాలమునుండి పరిచారికయైయున్న దీనిమాటలనే విపులాదేవివినును. (ఇంచుకయూరకుండి) నేనేమిసేయుదును. (ఇంచుకయూరకుండి) భీమరాజుపురినుండి యెవ్వఁడో బ్రాహ్మణుఁడరుదెంచెనని తెలిసినది, అందులో దాసిచెప్పుటలో మీయక్కగారనిగూడ విపులతోనుడివినది. ఆభీమరాజెవ్వరై యుండును; మాజనకుఁడు కాదుకదా? నాకుఁ బినతల్లికలదని వింటినుగాని యెన్నఁడును నామెనుఁ జూచియెఱుఁగను. (ఎడమకన్నదరుటనటించి) ఎడమకన్నదరుచున్నది ఇష్టమైన ప్రయాణము సంభవించునని పెద్దలు చెప్పుదురు నాకుఁ బ్రయాణమెక్కడికిసంభవించును.

తే. గీ. దాసిచెప్పినరీతి గం । ధంబుదీయ
కున్నచోనది మదియందు । గోపమూని
విపులతోఁ జెప్పి నగరంబు । వెడలజేయు
నద్దిగాకయింకేమి ప్ర । యాణమొదవు.

(నిష్క్రమించును)

———

రంగము:—(విపులాదేవిమందిరము:=విపుల-సుదేవుఁడు కూర్చుండియుందురు)

విపు—సుదేవా! మాయక్కయు బావయు నెంతబెంగఁగొని యుండిరో కదా? దమయంతిజాడగాని నలునిజాడగాని యేమియుఁ దెలియలేదా ?

సుదే—ఇంతవఱకును లేదు. అనేకులనేకదిక్కులకరిగినారు. నేనిట్లువచ్చితిని.



(దమయంతి ప్రవేశించును)

విపు—సైరంధ్రీ! నీవు సంశయింపవలదు. ఈబ్రాహ్మణోత్తముఁడు మాయక్కగారి యొద్దనుండి వచ్చినవాఁడే.

దమ—(సుదేవుని నేకదీక్షతోఁ జూచుచుండును)

సుదే—(దమయంతినిఁ జూచి) దమయంతీ! దమయంతీ!

దమ—(తలవంచును)

విపు—సుదేవా! ఈమె దమయంతియా! ఏమీ! ఏమీ!

సుదే—అమ్మా! విపులా! నేడు మాభాగ్యము ఫలించినది.

తే. గీ. తిరిగినట్టి యాయాసంబు । తీరిపోయెఁ
జిత్తమానందవారాసిఁ । జెలఁగె; కనుల
కరువుదీర మాదమయంతిఁ । గంటిభళిర
యిదికదా సుదినంబు తలప । సదమలాంగి.

(దమయంతినిఁ జూచి)

సీ. నిజరాజ్యమునువీడి । ప్రజలెల్లగుందఁగ
విపినాళికేరీతి । వెడలితమ్మ
పృథ్వీశుఁడెప్పుడు నిన్ను । విడనాడియెఱుఁగని
ప్రాణేశ్వరునినెట్లు । బాసితమ్మ
రమణీలలామ! నీ । ప్రాణవిభుఁడు నిన్ను
విడిచి యెచ్చోటికి । వెడలెనమ్మ
నలురాణివైయుండి । లలనరో సైరంధ్రి
వై యెట్టులిచ్చోట । వరలితమ్మ

తే. గీ. పిన్నతల్లిగృహమెఱిఁగి । వెలఁదినీవు
చేదినగరంబు నేరీతిఁ । జేరితమ్మ
అమ్మనినుఁజూడనాకు మో । దమ్ముగలిగె
సకలమువచింపు విడనాడి । సంశయంబు.

విపు—దమయంతీ! దమయంతీ! (కౌఁగిలించుకొనును)

దమ—(మూర్ఛిల్లును)

విప్ర—చెలీ! చెలీ! ఇటురా! ఇన్నివాళ్ళును సైరంధ్రియను కొన్నయువిద దమయంతియై మూర్ఛిల్లినది. నీవీమెకు శీతలోపచారము చేయవలయును.

(అవనికజారును)

రంగము:—[ఋతుపర్ణునాస్థానము:-ఋతుపర్ణుఁడు-
మంత్రి-వార్ష్ణేయుఁడు సుదేవుఁడు-బాహుకుఁడు]

సుదేవ—బాహుకా! ఆలిని నిర్దయనుబాసి విడిచిన నలుని మెచ్చుచుంటివా? అతఁడు వట్టియవివేకియని నాయభిప్రాయము.

బాహు—బ్రాహ్మణోత్తమా! కారణమేమియు లేకుండ యానలుఁడు దమయంతిని విడిచెనని తలంతువా?

సుదే—చూచినంతవఱకు నాకెచ్చటను కారణము గనిపించుటలేదు. అతఁడట్లుచేసి క్షుద్రబుద్ధిని వెల్లడిచేసికొనినాఁడు. అతఁడు బాసినకారణమున దమయంతి యెట్లుపరితాపమును బొందుచున్నదో. చూచినవారికి తెలియఁగలదు.

బాహు—సాధుఁడెంతయపరాధమొనర్చినను సాధ్వి దానిని బయలు పెట్టకూడదు.

సుదే—నీవాక్యములు బాగుగనున్నవి. చాలుచాలు. కారణములేక కాంతను బాసినవానిని మెచ్చుకొనుచుంటివి. దుర్వ్యసనమునఁజిక్కి రాజ్యశ్రీలనెల్ల దురోదరమునఁనోడి, తన్నుఁబాయలేక వెంటవచ్చిన సతీమణిని, పూతచరిత్రను, కాంతాలోకచూడామణిని దమయంతిని నరణ్యమునవిడిచిన యానలుని జగంబు మెచ్చునా?

బాహు—ప్రశంసవచ్చినది కావునఁజెప్పితిని. అయ్యా! ఇదియంతయు నాకేల? రాజేంద్రా! నేనుపోయివచ్చెదను.

ఋతు—నాకును వేళయైనది (నిష్క్రమింతురు)

సుదే—వార్ష్ణేయా! ఈబాహుకుఁడెవ్వఁడు?

వార్ష్ణే—నలునియొద్ద వంటలవాఁడుగనుండెనఁట. కాని నాకును జ్ఞాపకములేదు ఇప్పుడీయాస్థానమున నలుఁడున్నాఁడు.

సుదే—ఈతఁడు రాత్రియెచ్చట శయనించును.

వార్ష్ణే—మహానస గృహమున.

లోపల



(వార్ష్ణేయా)

వార్ష్ణే—ఎవరోపిలుచుచున్నారు—(నిష్క్రమించును)

సుదే—ఈబాహుకునిఁజూచిన నాకనుమానముగనున్నది. ప్రచ్ఛన్నవేషముననున్న నలుఁడేమోయని తలంచెదను. కానిమ్ము. ఈతని నిజస్థితి రాత్రి కనిపెట్టెదంగాక.

(నిష్క్రమించును)

---

రంగము[మహానసగృహము. బాహుకుఁడు జీవలుఁడు పడియుందురు.]

బాహు—జీవలా—జీవలా—(పలుకకయుండుటఁజూచి) ఈతఁడు నిద్రలోఁ బ్రవేశించినాఁడు. నాపలెనీతనికిఁ బరితాపమేమియును లేదుకదా?

సుదేవుఁడు—(ప్రవేశించి తనలో) ఈబాహుకుఁడెవ్వరో యరయుటకు నేనీచాటుగ నుండెద.

బాహు—(ఆకాశమువంకఁజూచుచు) భళిరా! నక్షత్రములాకాశము నెట్లలంకరించినవో!

సీ. ప్రాగద్రిగుహలకు । బర్వఁగఁ బారునా,
నిడుపులై ప్రాచికి । నీడలరిగె
నుదధినాయకుని పే । రోలగంబీక్షింపఁ
జనియెనా పాథోధి । నినుఁడు వ్రాలె.
బ్రియవియోగమున మూ । ర్ఛిలిపద్మినులుదృక్ప
యములు మోడ్చునఁబరమో । జములు మొగిడెఁ
దనమణిదళిదొంగఁ । గొనివగుయ్యాడునింగి
రోదయున ఖగముల । రుతములెసఁగ
వాసరాంతయుగాంత ప్ర । వర్తి నీల
శరదసంఘంబులనఁదమ । స్తతులు వరలె
గగనకేశశిరస్థగం । గాప్రదీప్త
బుద్బుదప్రతిమన నుడు । పుంజమాడరె.
కం. తనపతి రాఁగలఁడని గ్రొ
న్నన నేపథ్యంబుపూని । నవిభావర్యం

గనమేని చందనాలే
వనమో యనఁ బాండిమంబు ప్రాగ్దిశఁ దోఁచెన్,

అదిగో !

చ॥ అనుపమసాంధ్యరాగరుధి రావృత పద్మభవాండ యుద్ధరం
గనిబిడశార్వరాసురని కాయము మీఁదికి గాలతార్క్ష్య కే
తనుఁ డనుపంగ వచ్చిన సుదర్శనమో యనఁ బ్రాగ్ధరాగమం
దున నుదయారుణద్యుతుల తోఁ శశిబింబము దోఁచె నెయ్యెనన్,

చంద్రా !

తే. గీ. చల్లఁదనమిచ్చుచుండును చంద్రుఁడనుచుఁ
బలుకుచుందు రామాట యబద్ధమెపుడు
చల్లఁదనమిచ్చుటను లేదు చంద్ర నిన్ను
మింటఁ జూడఁగ నే నాకు మంటలొదవె.

అబ్బా ! యేమి ! యీ యతనుతాపము ! చంద్రునకు మన్మథుఁడు తోడైనాఁడు. (మన్మథుని నుద్దేశించి) మదనా ! నాపై నేల దాడి వెడలెదవు. ప్రియావియోగమున పరితాపమందు నామీఁదనా నీశౌర్యముఁ జూపుదువు ?

శా. మారా ! నీకు సపత్నవర్తనను ప్రేమం బేమియుఁ లేదుగా
గోరాజున్ భువనత్రయీ ప్రజన దక్షుండైన నీయన్న నే
పారాస్త్రంబులగు ప్రచ్చి నిచ్చలు తదస్త్రగ్రస్తుఁడై చిక్కియే
పారన్ జేసిన వాఁడ వాప్తహరణ వ్యాపార మెగ్గింతునే.

మ॥ పరశక్త్యుత్తముఁడున్ సదా భువన సంభావ్యాధ్యుఁడామ్నాయ త
స్కర సంహారగుణాభిరాముఁడన మే మస్వామియైనట్టి నీ
గురుదివ్యత్ప్రథమస్వరూపమున బల్ గుందన్ గడన్ గట్టి కా
దరమే పారఁగఁ జాటు నీవు హితులన్ వంచింపనూహింతువే.

మ॥ సురముఖ్యాస్త్రవనీయ ! నీజనని మేల్ సొంపారఁ గ్రీడించు మం
దిరముల్ నిర్దయనూఁడగుంజుకొని యారీ రేజసంవాస కా
పురముల్ నల్పగృహంబులే కాగి జగత్పుంజంబు పాలై సదా
తిరుగన్ జేసిన వాఁడ వాప్తులను భేదింపంగ భావింపవే.

తే. గీ. అట్టి సుమనః ప్రకాండులై యఖిలమహిమ
గాంచు నీవారి కేపార గతము లేని



కట్టడి విమార ! నీకు నేఁ జుట్టమునని
తెలుపుకొనుటెల్ల నానోటి తీటగాదె.

మ॥ హితులాభ్రాతృగురు ప్రసూప్రముఖులన్ హృద్వ్యధి శంకింపక
ప్రతిమకార్యముచే నగల్చువని కర్జంబౌనె నీకంచునో
రతినాథా ! నినుదూఱ నేమిటికి సాంద్రప్రీతితో నీవు పం
తతమున్ జేయు నిశాటమైత్రియది వ్యర్థంబౌనె దర్పాంధకా.

చ॥ అనిశము బల్ మనుప్రతగు సాధ్యుఁడవై మధుమత్త శీలజీ
వనకలితైకగంధవహ వాహుఁడవై హతశంబరుండవై
వనచరపాళి బాసట నవశ్యముఁ బాంథవధంబొనర్చు నీ
కను పురదర్ప వివేకము దయారసమాత్మ జనించునే స్మరా,

చ॥ అతిరతివిప్రయోగుల మహామధుమత్తుఁడవై వధించు దు
ర్మతివని కాదె నిన్ను నుమారాజకళాధరుఁడుగ్రమూర్తియై
తతనయనాగ్ని కీలికల దగ్ధునిఁ జేసెనుగాని చో శివా
పతి నిను రూపుమాపఁ బరిపంథి వె యాయనకీవు మన్మథా.

నట్టడవిని నిజాంగనను విడిచి గుట్టల బట్టించెనను కోపమున నీమన్మథుఁడు నన్నుమాటిం తెగారించుచున్నాఁడు. దమయంతినాయొద్దనుండినఁగాని యీతాపముడంగదు. (ఆకాశమువంకఁజూచి) అబ్బా ! ఇంకనునెప్పటికిఁ దెల్లవారునోకదా ! అదిగో

మ॥ నసజాప్తుండు స్వపోషితాబ్జసమితిన్ వారింపుచున్నాఁడ వీ
పనినీపై కడె వచ్చెనందయిన బాహ్యంచాత్మతారావిభుం
డను విశ్వాసము చేత వేఁగుజలజాతారాతికిన్ దెల్ప వ
చ్చిన చందంబున వేఁగుచుక్క యుదయించెన్ బూర్వభాగంబునన్.

తే॥గీ॥ తుహినకరుఁడస్తగిరికేగ దొడఁగు పద్మ
హితుద్యుప్రపరికోభి దూర్వాంకు రాపలోక
నాంకురిత భక్షణేచ్ఛాభి హరిణరాడ
ఖండశీఘ్రాపహృత మండలుండువోలె.

శా. తజ్జుల్ గాంచు త్రికాల బోధమునకాధారంబు మత్పూర్వక
బద్ధజ్ఞానంబెకదా మదుచ్చరిత శబ్దంబల్పమే యంచు స
ప్రాజ్ఞత్వం బెఱిఁగించుమాడ్కిఁ బ్రియమారన్ గుక్కుటంబుల్ దినా
స్యజ్ఞప్రోద్ధిభంగులన్ మొరసెవి శ్వగ్రామధామంబులన్

తే.గీ. అలరు రేచిల్వచెలి యుద । యాచలేంద్ర
వల్మీకము మీఁదఁ బ్రత్యూష । సర్పసమయ
మున విడిచిపోయి నట్టి ని । ర్మోకమనఁగఁ
దూర్పుదిక్కునఁ బాండిమ । ద్యుతిజనించె.

చ. సుదినకరోదయంబున సు । షుప్తివహించు ద్విజవ్రజానను
భ్యుదితసమాఖ్యఁ గాంచునని । పుల్గులు దాము ద్విజవ్రజంబె కా
నఁదదభినామధేయ వృజి । నంబు భయంబున మేలుకొన్న వీ
లఁదరు గులాయముల్ కలక । లధ్వని సేయుచు వెల్వడెన్ వడిన్.

చ. పరిణతసూనుగర్భయగు । ప్రాక్సతి తత్ప్రసవార్తివేదనా
భరము సహింపలేక ఖల । పతత్కృతారవకైతవంబునన్
మొరయిడఁ గాంచి జాలిపడు । భూజలతావనితాళి బాష్ప ని
ర్ఝరములనన్ దొరంగె సర । సచ్ఛదనోదరశీతలాంబువుల్.

ఉ. అనుగత శార్వరీ సమయ । మౌ శిశిరావసరంబు వాయవే
గననెడు వాసరాభ్యుదయ । కాలవసంత సమాగమార్తి బ
ల్కనదిన ప్రాగ్దిగాస్యయువ । లాళజ పావరబంధు జీవకా
ననసుమకాండకాంతితతి । నాఁబొడమెన్ నవసాంధ్యరాగముల్.

జీవ—(లేచి) ఈతసపరితాపము భార్యను గుఱించి కాఁబోలు. (ప్రకాశముగా)
బాహుకా !

బాహు—జీవలా ! నిద్రలేచితివా ?

జీవ—లేచితినిగాని నీవు భార్యను గుఱించియా తాపమందుచుంటివి?

బాహు—ఈ బాహుకున కదియొకటి తక్కువ.

జీవ—బాహుకా ! ఇంకను ప్రొద్దెంతయున్నది?

బాహు—ప్రొద్దేమున్నది. తెల్లవారుచున్నది అటుచూడుము.

సీ. ఉరుమహోదయధరే । శ్వరుఁడు దాల్చినపద్మ
రాగఖచితపుఁదు । రాయియనఁగ
బలభిత్ప్రభామంట । పమునందు బట్టిన
బెడగారు కెంబట్టు । గొడుగనంగఁ
బ్రత్యూషముని విష్ణు । పదమునకెత్తిన
దివ్యనీరాజన । దీపమనఁగ



తే.గీ. స్వతరుణారుణ కాంతులూ । ర్ధ్వమునకెగసి
శరధపథమండలంబు చెం । దిరము పొదిమి
నట్లుగావింప నొయ్యనొ । య్యనఁ బయోజ
మిత్రబింబము పూర్వాద్రి । మీఁదఁ దోఁచె.

ఉ. కమలంబుల్ వికసించెఁ దుమ్మెదలు ఝుం । కారధ్వనుల్ సేయుచు
బ్జమరందంబులు గ్రోలె కైరవ సమూ । హంబెల్ల నిద్రాణభా
వము నొందెన్ గవఁగూడె జక్కవలు శో । భాస్ఫూర్తిఁ గాంచెన్ హరి
త్సముదాయం బుల్లసఁ జల్లగా విసరెఁ బ్రా । తఃకాల వాతూలముల్.

మ. తరణిశ్రీపతి దివ్యచక్రములు మో । దంబంద శౌర్యప్రభా
స్ఫురితుండై కనువెంటనంటి విగత । జ్యోత్స్నారుసేనాసము
త్కరుఁడై; ద్యోశిబిరస్థలం బెడసి పా । తాళంబునన్ డాగవే
శరధిం దూకెను మాల్యవంతుడనఁగం । బద్వేషినాథుం బునన్.

జీవ—ఆ రమ్ముపోదము. (ఇరువురును నిష్క్రమింతురు.)

సుదేవుఁడు—(ముందుకువచ్చి)

శా. నాయత్నంబు ఫలింపఁ జూచితి మహా । నందంబు నందిల్లెనా
హా! యానైషధు నన్యభూధవ సిరీ । లాంఛత్తు పీరప్రభా
శ్రీయుక్తాంచితు నాత్మ దివ్యమణి రా । జీ రాజితాంఘ్రిన్ జగ
ద్గేయుం దీనజనావనున్ గుణమణీ । ధీరప్రతాపాగ్రణిన్

సీ. తనజయధ్వజ సము । ద్యద్భూరి వాతంబు
వైరిప్రతాప దీ । పంబులార్ప
తనశౌర్యభాస్కరో । దయకాంతి పగతుర
గర్వాంధకారంబు । గలఁచివేయ
తనభేరిభాంకర । ణనిఖిలారి నృపాల
మండలి గుండెలు । పిండిసేయ
తన సైన్యధాటి కో । ద్ధతధూళి రిపుసేన
నుప్పుచుచును వేగ । నూదివేయ

తే.గీ. నిషధరాజ్యంబు నేలు మ । న్నీఁడు నేఁడు
కాలగతిచేత వైభవ । శ్రీలఁబాసి

వంటవాఁడౌచు సామంత । పార్థివేంద్రుఁ
గొలుచుచుండెను కటకటా । క్రూరవిధిని.

కటకటా! ఎట్టిమహారాజును నాపాపంపుఁ గన్నులెట్టి నీచస్థితింగాంచఁ బాల్పడినవి ? సకల సామంత నృపాల వర్గంబులుఁ దన కిరువంకల వినయవినమితాంగులై నిలచి, ఛత్రచామరాదిరాజలాంఛనంబులంబట్టి కైవారంబులు సలుప, విభాసిల్లు రాజరాజేంద్ర కోటీరమణి ఘృణి నీరాజితపాదకమలయుగళుండు నేటి కొక్క సామంత రాజునకు వంటలవాఁడై కరములు జోడించి కైదండవట్టి నిలువవలసి వచ్చెగదా? శత్రు రాణ్మస్తకవిచ్ఛేదన ప్రశస్తంబగు కోదండంబుఁ దాల్పవలసిన యాకరములా నేఁడట్లు గరిటెంబట్టినవి?- నిరంతరాతపత్రసంశోభిత శిరఃకమలుండగు నీరాజన్య చూడామణియా నేటికి వర్షాతపభీతిచే వంటయింటఁ దలఁదాఁచుకొనఁగఁ దంగె? నేత్రకమల సంచలన మాత్రంబునఁ దన యభిప్రాయంబు నెఱింగి, కురంగట- దనకోరిన కోరికలఁ బరిచారికా జనంబులు దీర్ప, మహేంద్ర విభవంబుల ననుభవించు మహాభోగికా- నొక్క-సామంతరాజుకడ సేవ?- కటకటా! హతవిధీ! నీవెంత బలవంతుఁడవు? భయంకరమై సకల వన్య మృగసంతానంబుల శాసింపఁదగు కంఠీరవంబు నధమంబగు మార్జాలమునుగా మార్పఁగలిగితివి?......... అకటా! ఇప్పుడు నాకేమియుందోచుట లేదు! ఏమూలబున నున్న నేమి ? ఏయవస్థనున్న నేమి ? మానలభూమిబాధ వుంగంటి- కాని, కన్నఫలమేమి?- మాటలాడుటకైన నసమర్థుఁడనైతినిగదా!......... పోనిమ్ము; ఒకమారుగ నాతనిఁగని నలసార్వభౌమా! "యనిపిలుతునా?......"నీవెవ్వండవు?- నేనలుఁడగాను. పొమ్మనిన?- ఏమిచేయనలయు?- ఏయాధారములం జూపి, నీవ నలుఁడవని వాదించి నిర్ధారణము సేయఁగలను ?......దమయంతీదేవి నిక్కడకుఁ బిలిపింతునా?......వచ్చిన?—నిది యంతఃపురవ్యవహారము ! ఎటుపోయి యెటు వచ్చునో? అప్పుడు నిర్నిమిత్తంబుగ నేనందఱి యాగ్రహంబునకు గురి గావలసివచ్చుంగదా !.........భీమరాజుచే నల్లునకు, రమ్మని కమ్మవ్రాయింతునా?......ఏయుపాయమున, నేయుక్తిచే వ్రాయవలయు?- ఋతుపర్ణునితోడ, నిస్సందేహముగ, నీయింట నుండు వంటలవాఁడగు బాహుకుఁడు, నలుండని తెలియఁజేతునా?... తెలియఁజేసిన ? రాజ్యచ్యుతుండగు నలరాజేంద్రుఁడు లజ్జాభరంబున నేనలుండగానని గట్టిపట్టు వట్టిన నేది మార్గము?—కటకటా! తెలిసియుఁ దెలియనట్లయ్యె—ఏమి చేయుదు—నలుని దూషించి నప్పటి ప్రత్యుత్తరములచేతను, దమయంతీదేవితో



డ నలుఁడు కర్కోటక సర్పవిషదంష్ట్రానలంబున విరూపుండై యుండెనని తెలుపుటం జేసియు, నీతనికి పాచకాశ్వశిక్షాధర్మంబులు తెలియుటచేతను, నేటిరాత్రి యీవియోగంబు చేతను, విశేషించి ధ్వని నవ్వాడింబట్టియు నలమహారాజచంద్రుఁ డీతఁడే యనుటకు సందేహము లేదు—రూపము మారకున్న మానె! —నేనే నలుఁడనని. దమయంతి నేలుకొనినవదే పదివేలు—సంయోగమున కాపరమేశ్వరుఁడున్నాఁడు బుద్ధిబలము ప్రదర్శింతును— ఆవల నేమగునో చూతము— ఈయుపాయమే బాగున్నది.

(నిష్క్రమించును)

---

* ఈసుదేవుని వచన భాగము శ్రీయుత సోమరాజు రామానుజరావుగారిచే రచింపఁబడి చేర్పబడినది.





మంజుల నైషధమను

# చిత్రనళీయము.

## పంచమాంకము.

రంగము:—(విదర్భ:—మందిరమున భీమరాజు—దమయంతి-సుదేవుఁడు)

దమ—సుదేవా! పూర్వజన్మమున నెన్ని పాపములు చేసియుంటినో, యవియన్నియు, నిప్పుడనుభవించుచుంటిని. మఱల నీ మహాపాపము నెట్లు గట్టుకొందును.

సీ. పతిభక్తియంతయు । క్షితిలోనఁ గలియంగ
దీనికి నెప్పుడో । బూనవగునె
దైవతుల్యుండైన । జీవేశు నెడలను
సాధ్వి యీదోషంబు । సలుపఁదగునె
యిటువంటి దుష్కార్య । మేఁ జేసి జగమందుఁ
దలయెత్తి యెక్కంత । మెలఁగఁగలనె
సాధ్వినై గొన్నయ । శంబెల్ల దీనితో
నేలపాలైపోదె । నిర్మలాత్మ

తే. గీ. ప్రాణమూడిన నూడనీ । ప్రాణవిభుఁడు
రాకమానిన మాననీ । లోకమందు
ధర్మము నశింపఁజేయు నీ । దారి కేను
సమ్మతింపఁగఁ జాలనో । భూసురేంద్ర.

సుదే—

మ. జనలోకేశుఁడు నిన్నుఁ జూచుటకునై । జన్దెంచుమార్గంబునే
మనమందారసి యిట్లు జెప్పితిని భా । మా! యంతియేగాని నా



కనుమోదంబు ఘటించునే యకట! నీ । యాత్మన్ విచారించి నూ
తనమార్గంబెదయైననున్ దెలుపు మో । దంబందుచున్ జేసెదన్.

దమ—బ్రాహ్మణోత్తమా! స్త్రీనగు నే నేమి యుపాయ మరయఁగలను. ఎంతవలకుఁ జూచినను నాకేమియుఁ దోచుటయే లేదు. దీనివలన ధర్మమా నశించును. పుణ్యమా పోవును. దుర్యశమా జగమునందంతటను ప్రాకును.

భీమ—

సీ. ఈవెంత పల్కిన । నిట్టి దుష్కార్యమ్ము
సలుపను దేవ! నే । సమ్మతింప
దీనిచే నేఁ గొన్న । దివ్యయశంబెల్ల
క్షణములో పలమంటఁ । గలసిపోవు
భూమీశలోకంబు । భీముఁడే యీపనిఁ
జేసెనాయనుచు హా । సింపకుండె
నాపుణ్యకార్యముల్ । నాధర్మసంధత
యడవిలో వెన్నెల । వడువుకాదె.

తే. గీ. అకట! సుతవతియాదమ । యంతియెడ
నీవు చెప్పు స్వయంవరం । బేడధరను
నెన్నఁడైనను వింటిమే । యిట్టికార్య
మేను సమ్మతింపఁగఁజాల । నింతయేని.

సుదే—రాజేంద్రా! నేనెంతయో యోచించితిని. ఈమార్గము తప్ప మఱియొక మార్గము లేదు. మనయొక్క ఋతుపర్ణునకుఁ దప్ప మఱి యెవ్వరికిని స్వయంవర పత్రికఁ బంపవద్దు. శాస్త్రవిషయమునుగూర్చి నీవు సంశయింపవలదు ఆభారమంతయు నాయది, సంశయింపక రమ్ము.

(నిష్క్రమింతురు.)

---

రంగము:—[ఋతుపర్ణుని యాస్థానము:—ఋతుపర్ణుఁడు-మంత్రి వార్ష్ణేయుఁడు బాహుకుఁడు]

ఋతు—బాహుకా! నీపొందుచేతనో గాని మిగుల బెంగఁ గొనియున్న విధము నాకుఁ దోచుచున్నది,

బాహు—దేవా! బెంగ యేమియు లేదు; కాని కొన్ని దినములనుండి హృదయము చెదరియున్నది. కారణమూహింపఁజాలకయున్నాను.

సేవ—(ప్రవేశించి) మహారాజా! మొన్న విదర్భనుండి వచ్చిన భీమరాజపురోహితుఁడగు సుదేవుఁడు వచ్చియున్నాఁడు.

ఋతు—శీఘ్రముగ లోపలికి రానిమ్ము.

సేవ—చిత్తము—(నిష్క్రమించి వెంటనే సుదేవునితోఁ బ్రవేశించును.)

ఋతు—భూదేవమణీ! నానమస్కారము లందుకొని యీ యాసనమునఁ గూర్చుండుఁడు.

సుదే—(కూర్చుండును)

ఋతు—సుదేవా! నలునిజాడ యేమైనఁ దెలిసినదా?

సుదే—ఇంతవఱకును నేమియుఁ దెలియలేదు.

ఋతు—మఱల నీవు బయలుదేరితి వేల?

సుదే—రాజేంద్రా! ఈలేఖం జూడుము. (లేఖ నిచ్చును)

ఋతు—(చేతికిచ్చి బాహుకునిఁ జూచి) బాహుకా! ఈలేఖ చదువుము.

బాహు—(జాబువిప్పి)

శ్రీరమానాథ పవిత్ర చరణారవింద నిష్యందితామంద మకరందరసాస్వాదనామోదసుఖోన్మత్త మధువ్రతుండును, నిత్యసత్యవ్రతధుర్యతాపర్యాయహరిశ్చంద్రుఁడును, శరణాగత రక్షణావిచక్షణాక్షీణ దీక్షాసర్వలక్షితాంబుజాతుండును; సాయోధ్యానగరసింహాసనాధ్యక్షుఁడును, నగు శ్రీ ఋతుపర్ణరాజర్షిచంద్రునకు—

విదర్భ పురాధిపతియగు భీమరాజు వినయపూర్వకముగ నమస్కరించి వ్రాయుపత్రిక—

రాజచంద్రా!

నేను చిరకాలము సంతానము లేక, దమనమునీంద్రుని యాశ్రయించి, యమ్మహానుభావుని యనుగ్రహంబున దముఁడను నొక్క కుమారుని, దమయంతియను తనూజను గంటిని. ఆదమయంతి స్వయంవరమున చారుసుందరమూర్తియు, సిద్ధసత్యకీర్తియు నగు శ్రీనలచక్రవర్తిని వరించియుండ్రి నేనుఁ దనపుత్త్రినిఁ బడయుట లోకమునకు విదితము. మాయాకలి



ప్రేరణమున నాచక్రవర్తి దుర్ద్యూతమున సర్వమునోడి, కన్నకుమారుని నాకడకు బంపి, భార్యాసహితుఁడై యరణ్యమునకరిగి, విధికృతమున, దమయంతిని నరణ్యమున నొంటరిగ విడిచి యెచ్చటికో యరిగెను. దమయంతియు నాథునకై వగచుచు నెట్లో పిన్నతల్లియగు విపుల యొద్దకుం జేరి తదన్వేషణార్థమై నాచేఁ బంపఁబడిన భూసురులచేఁ గుర్తింపఁబడి, నాగృహంబునకుఁ గొనిరాఁబడెను. నలుని వెదకుటకై యనేకులను సమస్త ప్రదేశములకును బంపితిని. అతనిజాడ యెందునుఁ దెలియలేదు. దమయంతి పరితాపమిట్టిదని వ్రాయునలవి కాదు. ఆకారణమున శాస్త్రజ్ఞులను విచారించి, ధర్మశాస్త్రమున ననుసరించి, రాఁగల శుద్ధపంచమీ కుజవారమున రాత్రి పదునారుఘడియలకు మేషలగ్నమున

(చదువుట యాపును)

ఋతు—బాహుకా! ఆపితివేమి?

బాహు—మహారాజా! ఎందులకో మనస్సు చెదరియున్నదని యింతకుమున్నే విన్నవించి యుంటినిగదా? పైత్యాధిక్యముచేతఁ గన్నులు తిరుగుచున్నవి.

ఋతు—మంత్రీ! ఆలేఖ నీవందుకొని చదువుము.

మంత్రి—(జాబు పుచ్చుకొని) దమయంతికి ద్వితీయస్వయంవరము సేయ నిశ్చయించితిని.

బాహు—(తనలో) హా! (నిష్క్రమించును)

ఋతు—సుదేవా! యీపత్రిక యేమి?

సుదే—ఏమున్నది! దమయంతి ద్వితీయస్వయంవరము.

ఋతు—నాకాశ్చర్యముగ నున్నది.

సుదే—ఆశ్చర్యమేమియు లేదు. శాస్త్రసమ్మతమే. ఇదియంతయు నేను పూర్తిగ విచారించినాను. బ్రహ్మనుమించిన పండితులతో నైన నేను వాదింపఁగలను.

ఋతు—

సీ. దమనమునీంద్రుని । విమల కరుణచేత
భీమునిసుతయైన । విద్రుమోష్ఠి
నలరాజు పైఁ బ్రేమ । నలయింద్రుని కోరికఁ
ద్రోసిపుచ్చిన నవ । తోయజాక్షి

సాధ్వీతిలకమై యశంబొంది తండ్రికిఁ
గీర్తిఁగొల్పినయట్టి కీరవాణి
సద్గుణంబుల యందు సరసిజాక్షులయందు
నగ్రగణ్య యయిన యాతివమిన్న

తే. గీ. వంశ వర్ధనుఁడగు పుత్రు వడసినట్టి
ధన్య! యాదమయంతి కా ధాత్రిదేవ:
యీద్వితీయ స్వయంవరం బెంచినారు
నమ్మఁజాలను నామది నమ్మఁజాల.

ఇందులకు భీమరాజంగీకరించెనా? దమయంతి యొప్పుకొనెనా?

సుదే—అవిచారణమున కేమి; అదియంతయు నైనపిదప నేకదా యిట్టిది నిశ్చయింపఁ బడెనది.

ఋతు—మంత్రీ! తరువాత చదువుము.

మంత్రి—"కావునఁ దత్స్వయంవర మహోత్సవమునకు నీవు దప్పక రావలయునని ప్రార్థించుచున్నాను.

ఋతు—(లేఖను దీసికొని) ఓహో! స్వయంవరదినముగూడ నెల్లుండియే. సుదేవా! ఇంతతొందరగా నేనెట్లు విదర్భకు రాగలను?

సుదే—నీయొద్దనున్న బాహుకుఁడు రథసారథ్యమున మిగుల నిపుణతయున్న వాఁడు. అతఁడు సారథియయ్యెనేని నీవు విదర్భకు తేపే చేరగలవు.

ఋతు—మంత్రీ! విదర్భకు తేపు సాయంత్రమునకుఁ జేరవలయుననియు, రథము సిద్ధముఁజేసి, ప్రయాణమునకు దానుగూడ సంసిద్ధుఁడై యుండునట్లు నావాక్యములుగా బాహుకునకుఁ దెలుపుము. ఈచిత్రిమరసి రావలయు. రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

---

రంగము—[ఋతుపర్ణుని మందిరము-బాహుకుఁడు జాబుతో ప్రవేశము]

బాహు—హా! దమయంతీ!

సీ. రూపవతీమణీ పా[illegible]
చెప్పగా లేదె నీ చిత్తమైన
కల్యాణి యీక్రూర కార్యంబు గావింప
నెవ్వారుబోధించి యొగడినారు
మోహనాంగిరో నన్ను భూరిదుర్భరశోక
సాగరంబందు ముంచఁ దగున
కన్నడ యిదియేల కాంతునిపైఁజాలి
సాహసించితివి నీ స్వాంతమందు

గీ. శంకరాభరణ శయన, సన్నిభుఁడగు
చిన్న పుత్రుఁడునైన వీ క్షింపలేదె
తగదు తగదిట్టి పని యని దయనుబూని
భీమ భూపాలుఁడైన వీ క్షింపలేదె.

ఆహా! ఈలేఖ నాకెంతయు వింతఁగొలుపుచున్న దే! ఇదినమ్మదగునా—నమ్మకయుందునా? నమ్మకయుండుటెట్లు! భీమరాజుచేవ్రాలుకలదు. ఇంతకంటె జాబునందు సత్యమును స్థాపించుటకేమి కావలయును. హా! దమయంతీ! నీకిట్టి ద్వితీయస్వయంవరవాంఛయేల జనించినది? స్వయంవరమునకు ముందు బృందారకేంద్రులు పంపిన సందేశమునఁబరిగణింపక నేను నలుని దప్ప నన్యుని వరింపనని ప్రత్యుత్తరమంపి నన్ను వరించితివే! ఇప్పుడామోహమునెట్లు పరిత్యజించితివి. ఘోరారణ్యమున నిన్నొంటిగ విడిచియరిగితినని నాపైఁగినుక వహించి యిట్టి క్రూరకార్యముఁజేయుటకు సాహసించితివా? పల్లవాధరీ! నేను నిశ్చయముగా నీయెడల క్రూరకార్యమునే యొనర్చియుందునుగాక! అట్టి కార్యమునకు సాధ్వీలోకమున దమయంతి యట్టికాంత లేదని కీర్తిగన్న నీవు; వంశవర్ధనుండగు నొక్కపుత్రరత్నమును గాంచిన నీవు; నాథా! ఎట్టి యాపదలువచ్చినను నిన్నెడబాయనని పలికి—నాపైభక్తిచేఁగుమారునిఁ బుట్టింటికిఁ బంపి, నాతో నరణ్యమునకు వచ్చిన నీవు; గతించిన సౌఖ్యదినములు తలంచుకొని దుఃఖించునాకు, సముచితధైర్యవచనముల దెలిపి, ప్రముదితస్వాంతునిఁగాఁ జేసిన, నీవు; అక్కటా! నేడు, ద్వితీయస్వయంవరమునకు సమ్మతించి నలునిఁ బరిభవింపఁదలంచితివా? నారీలోకము నిన్ను బరిహసింతురనియైన నీయాత్మనీకు బోధింపలేదా! ధర్మము—యశము—అంటగంటుననియైన నీకుఁదోచలేదా! కొడుకునుగన్న దమయంతి యిట్టియకార్యమునర్చెనని పదునాల్గులోకముల వారు నిన్ను నిందింతురనియైన తలంపవేల? యోషామణీ! నీవు నాయందుజూపిన మోహము—ప్రేమ—భక్తి—మొదలగునవి యన్నియు నసత్యమును జేసితివే! అక్కటా! నిషధసామ్రాజ్యలక్ష్మీ దురంధరరమణీ యహేమరత్న సింహాసనాసీననునాశిరసమ

వైభవేంద్రుఁడగు ఈనలుఁడు;—నిరతావృతయాచకచ్ఛటాకపట చాతకవ్రాత నూతన వసారాయితదై నందిన దానధారాపటలుండగు నీనలుఁడు;—చటుల తరవరిశయకాలఖేలన్మహానట నిటలతటోజ్జ్వలితనయనోద్గతజ్వలనజ్వాలికావిస్ఫులింగభంగీభవదభంగురాచ్ఛచ్ఛాయాసముద్దీపితప్రతాపాతపాటోపనిరూపితాఖర్వగర్వవత్సర్వశార్వరుండగు నీనలుఁడు;—వివిధాశ్రితవిద్వద్గురుసుహృద్బాంధవకామ్యభాగధేయుండగు నీనలుఁడు;—ఆశ్రితజనరక్షణదీక్షాబద్ధకంకణుండగు నీనలుఁడు;—వీరసేవధరానాయకానేకజన్మకృతతపఃఫలరూపావతారుండని జగంబున వినుతిఁగాంచిన యీనలుని; హా! ఎంతపాపము! ఎంతదోషము! ఎంతక్రూరము!—రాజన్యలోకమునఁ దలయెత్తి మెలఁగకుండఁ జేసితివే!—

హా! రమ్యహర్మ్య! అరణ్యమున నిన్నట్లు పరమకిరాతుఁడనై విడిచినందుకు ఫలముగా సర్పదష్టుఁడనై రూపము మాఱి ఋతుపర్ణునిఁ జేరియుండ, సుదేవునివలన నిన్న వింటినికదా నీవు విదర్భకుఁ జేరితివని తెలిసి, యెట్లయిన నిన్నుఁ జేరుటకు మార్గమూహించుచుంటిని. ఇంతలో నియ్యది ప్రాప్తించెను. ఇందులకేమని వగతును. హా! విద్యుల్లతాంగీ! జూదమునకుఁ బూర్వము ద్యానవనమున నీవన్నమాట మఱచితివా! పక్షులు నావసనము హరించినప్పుడు నీచేలము నందొక భాగముఁ జించి నాకుఁ గట్టఁబెట్టిన యనురాగము పరిత్యజించితివా? అయ్యో! నీకే యిట్టి బుద్ధిపుట్టినదా! నమ్మఁజాలను. నమ్మఁజాలను. ఇంకను నేను వెఱ్ఱివాఁడనగుచుంటినేమి!—(జాబుఁజూచి) శుద్ధ పంచమీ కుజవారము - మేషలగ్నము - రాత్రి పదునాలుగడియలకు - స్వయంవరమఁట - ఈచోద్యమేమి! ఇట్టిలగ్నములయందు వివాహములు సేయుదురా? ఇదియంతయు నత్యద్భుతముగొలుపుచున్నది. ఒకవేళ నిట్టివివాహముల కిట్టిలగ్నముఁ బెట్టుదురేమో! ఎట్లునగిపుచ్చుకొందమన్నను నాకేమియుఁ దోచలేదు. ఒకవేళను దేవుఁడు నన్ను గుర్తించి విదర్భకు రప్పించుటకీయుపాయముఁ బన్నియుండునా? నన్నురప్పించుటకిట్టి నీచమగు నుపాయమా? వేఱొకయుపాయమేదైనఁ గానిపింపదా? మహానుభావుఁడును, రాజర్షియునగు ఋతుపర్ణునకసత్యపులేఖ వ్రాయుటకుభీమరాజు సాహసించునా? కావున నెన్నివిధములఁజూచినను స్వయంవరమే నిశ్చయము. హా! దమయంతికి ద్వితీయస్వయంవరమా! ద్వితీయస్వయంవరమా? ఈనలుఁడు చూచి సహింపఁగలఁడా! మాయాద్యూతమున సర్వరాజ్యశ్రీబనోడి, తుదకుఁగట్టుబట్టతో నరణ్యమున కరుదెంచినను నోర్చితిని. సర్పదష్టుఁడనై రూపము మాఱిపోయినను భరించితిని. నీచ



సేవకుఁడనైనను సహించితిని. కాని యీద్వితీయస్వయంవరవార్తమాత్రము విని యోర్వఁజాలకయున్నాను. ఇయ్యది నాహృదయమునఁబ్రవేశించి, యాపాదమస్తకము దహించివేయుచున్నది. ఈహృదయపరితాపాగ్నిజ్వాలలఁ జల్లార్చుటకు మార్గము గానరాకయున్నది! హా! దమయంతీ! ఇంకెక్కడ దమయంతి! దమయంతి కినాకును దూరమైనది. తలోదరీ! నీదివ్య మంగళాంగమును నేనీజన్మమునందిఁక జూడను. ఈనిర్భాగ్యుఁడగు నలుఁడు జీవించియుండఁగనే, నీవు వేఱొకనిని వరించుచుంటివి. నాయనా ఇంద్రసేనా! తండ్రియని నీవిఁక నెవ్వరినిఁ బిలుతువు! కుమారా! నీతల్లికి నాపైఁ గ్రోధముండుఁగాక! నీమొగమైనఁ జూడలేకపోయితినే! ఛీ! ఈనలుని జీవితము వ్యర్థమైపోయినది. ఇట్లుపరాభవమంది యింకనీతఁడు జీవింపఁజాలఁడు - హా దమయంతీ! నీకును నాకును సంబంధము తీరిపోయినది. శుద్ధాంతసౌధంబులయందు హంసతూలికాతల్పమున నాసీనుఁడనై - పరిచారికలు గొలువ భాసిల్లుచు నీతో మృదుమధుర సంభాషణము జేయుభాగ్యమంతరించినది. నందనసమానోద్యానముల యందు నీతో విహరించు కోరిక యడుగంటినది. ద్రాక్షాశర్కరాదులకంటె మధురతరమైన నీముద్దుఁగొను భ్రాంతి కాలగర్భమునఁ బడి మాయమైపోయినది.

హా! దమయంతీ! నాసర్వసౌఖ్యములకు నిలయమని నేనెవ్వరిని దలంచి సంతోషించుచుందునో, నేనెట్టియిడుములఁ బడుచుండినను, ఏమాత్రపుఁ బరితాపము నెవ్వరికి రాకుండ నుండవలయునని వేయిదేవుళ్లకనిశంబును మ్రొక్కుచుందునో, యట్టినీవు నలుని బాగుగఁ బరిభవించితివి. ఇఁక నాకీజీవయాత్రతో నేమిపని? దమయంతి లేని నలుని బ్రతుకేల? దమయంతిపైనున్న మోహమా! నలుని హృదయమునుండి పొమ్ము. సౌఖ్యమా! దూరముగనుండుము - కరుణారసమా! బిడ్డలఁగన్న మహాశయులఁ జేరుము. ఓ అగ్నిభట్టారకా; నన్నుదహించివేయుము. చండమారుతమా! నన్నుఁగొనిపోయి సముద్రమునఁ బడవేయుము. ఆకాశమా! నామీఁదఁబడి నలిపివేయుము. హా! దమయంతీ! దమయంతీ! ద్వితీయస్వయంవరమా! ద్వితీయస్వయంవరమా! దుఃఖము-దుర్భరము - కష్టము! కఠినము కఠినాత్కఠినము - సాహసము - సాహసము - భరింపఁజాల-భరింపఁజాల,

(మూర్ఛిల్లును)

(యవనిక పడును)

రంగము [విదర్భలో మందిరము. దమయంతి ప్రవేశము]

దమ—(తనలో) అకటా! నేనెట్టిసాహసకార్యమునకు సమ్మతించితిని. నాప్రాణేశ్వరుఁడిదివిని మనంబుననెట్లుగా దలంచుచుండెనో?

తే.గీ. మంచిచెడ్డల మది విచా । రించకుండ
జనకుఁడు వచించినంతనే । సమ్మతించి
నాను; లేఖవ్రాయంగ; నా । నాథుఁడేమి
గా దలంచునోయిదినన్నుఁ । గాల్చుచుండె.

ఇప్పుడు నేనేమి విచారించిన లాభమున్నది.

తే.గీ. కొడుకుగల రాజచంద్రుని । వడతికేమి
పరిణయంబని రాజన్య । వర్యులెల్ల
పరిహసింపకుందురె నగు । బాటులయ్యె
కటకటా! నాదు జన్మంబు । తన్మాతలమున.

భార—(ప్రవేశించి) అమ్మా దమయంతీ! ఇంకను నీవు విచారించుచుంటివేల? నలుఁడువచ్చినాడు. ఇఁకనీవు సత్వరముగనే పతిని జేరఁగలవు.

దమ—నాథుఁడువచ్చినట్లు నీకెట్లు తెలియును?

భార—ఋతుపర్ణునితోనున్న బాహుకుఁడే నీనాథుఁడని సుదేవుఁడు చెప్పియుండెను. గదా?

దమ—ఇదియా! నీవు చెప్పఁదలఁచినవార్త, అతఁడు నాప్రాణేశ్వరుఁడగునో కాదో. నీవు యుపాయముఁ బన్ని యరయవలయునుగదా?

భార—సరే; అట్లే చేసెదను రమ్ము.

(నిష్క్రమింతురు)

---

రంగము [భీమరాజు నగరునసొకవంటయిల్లు.-ప్రవేశము-బాహుకుఁడు]

బాహు—ఆహా! నాకిదియంతయు వింతగనున్నది. రేపుస్వయంవరమేమి! ఈనగరము నేడిట్లుండుటయేమి? ఒక్కఋతుపర్ణుఁడుదప్ప నెవ్వరునురాలేదు. ఈస్వయంవరమసత్యమై యుండునేమో?

భారతి—(ప్రవేశించి) బాహుకా!

బాహు—ఎవరువారు.



భార—నేను దమయంతి చెలికత్తెను. నాపేరు భారతియందురు.

బాహు—సరే; నీవు ఇక్కడికేలయరుదెంచితివి?

భార—వంటకు గావలసిన సంభారములన్నియు మీకు సమగ్రముగా బంపఁబడినవో లేదో యరయుటకు.

బాహు—ఈకార్యము నీయందు బెట్టిరాయేమి?

భార—ఒకరుపెట్టుటయేమి. నేనేకనుఁగొనఁదలఁచి వచ్చితిని. ఇతరులు మాపురమునకు వచ్చినప్పుడు మేము గౌరవింపవలయునుగదా?

బాహు—మంచిదే. కాని మాఋతుపర్ణునివెంట నెవ్వరును కాంతాజనము రాలేదు. అందుచేత ప్రత్యేకము పురుషులున్న ప్రదేశమునకు నీవురాఁగూడదు.

భార—ఇచ్చట పురుషు లెవ్వరున్నారు?

బాహు—నేనుగానా?

భార—నీవు ఋతుపర్ణునివంటలవాఁడవు కాదా?

బాహు—అయిన

భార—మరేమియు లేదు. వంటవాండ్రు స్త్రీలతో సమానులే.

బాహు—నీచమత్కారవాక్యములకు నేను ప్రత్యుత్తరమీయఁజాలనుగాని, రేపే కదా స్వయంవరము.

భార—అవును.

బాహు—నగరమేమియు నలంకరింపఁబడలేదేమి! రాజులెవ్వరును రాలేదేమి?

భార—రావలసినవారు వచ్చిరి.

బాహు—శుభసూచనార్థము తోరణములైనఁ గట్టలేదేమి?

భార—ఇదివఱకైనపెండ్లియే మరల చేయుటకదా? దానికంత యలంకారము లవసరములేదు.

బాహు—అనగా నాకర్థము తెలియలేదు.

భార-నీకు వంటసేయుటతప్ప మఱేమియుఁ దెలియదు.నీపేరెవ్వరో.యెఱుంగవచ్చునా?

బాహు—నల.—బాహుకుఁడు

భార—నల్ల బాహుకుఁడా! రూపమునకు సరియైనపేరే.

(లోపల)

భారతీ! భారతీ!

బాహు—ఆపిలుచునది యెవరు ?

భార—ఎవరైననేమి ! మాదమయంతీదేవికుమారుఁడు (ఎదుటఁజూచి) నాయనా! వచ్చుచున్నాను.

(నిష్క్రమించును)

ఇంద్ర—భారతీ ! భారతీ !

బాహు—కుమారా ! మీభారతి యిప్పుడే యిట్లరిగినది. నీవెవ్వరవు?

ఇంద్ర—నేను నలచక్రవర్తి పుత్రుఁడను. మాయమ్మ దమయంతీదేవి.

తే.గీ. రారనాభాగ్యములపంట । రారకుఱ్ఱ
రారనాతపఃఫలరాసి । రారతండ్రి
రార నాకులవర్ధన । రారపుత్ర
రార కందర్పరూప, రా, । రాకుమారా.

(ఎత్తుకొని ముద్దులాడును.)

ఇంద్ర—నన్ను దింపుము. మా

భార—(ప్రవేశించి) ఇదేమిబాహుకా ! కుమారు నెత్తుకొంటివి ?

బాహు—భారతీ ! పిల్లలెవరికైనా ముద్దేకదా ! అదిగాక, ఈతనిరూపురేఖావిలాసములు నాకుమారునివలె యున్నవి.

భార—పెండ్లికివచ్చినస్త్రీలెల్ల నాపెండ్లాములే యన్నట్లున్నది.

బాహు—పెండ్లియనిన జ్ఞాపకమునకువచ్చినది. దమయంతీ ద్వితీయస్వయంవరమహోత్సవవిశేషములు చెప్పవా ? రేపు స్వయంవరము జరుగునా జరుగదా ?

భార—దమయంతిని వరించువాఁడు రావలెనుగదా.

బాహు—అతఁడెవరు ?

భార—ఎవరుందురు నళుఁడు.

బాహు—నలుఁడెక్కడనున్నాఁడు.

భార—ఎక్కడుండును. పాపము పాము కఱచి వికృతరూపుఁడైనాఁడట,

ఇంద్ర—ఏమేమీ ! భారతీ ! మాయయ్యను పాము కఱచినదా ! ఈమాటవాకిది వఱకెప్పుడును చెప్పలేదేమి ?





సీ. ఇదెవచ్చుమాయయ్య । అదెవచ్చునని చెప్పు
చుంటివియిదిరేమి । చోద్యమమ్మ
యయ్యరాకుండుగా । కదియేమి ఘోర స
ర్పము కఱచెననుచుఁ । బలికెదావు
యింతలో నీరీతి । నేలపల్కితివమ్మ
నమ్మదానాన్న । నెమ్మనమున
మును దెల్పియున్న నా । చెనటిపామునుజంపి
తండ్రినానందాబ్ధిఁ । దనుపనమ్మ
తే. దాచెదేటికి నీకైన । తండ్రివచ్చి
సంతసముఁగూర్చునా నాకు । సత్వరముగ
నిప్పుడైననుచెప్పుమా । యొప్పుగాను
శాంతిఁబొందెద భారతీ । స్వాంతమందు.

మాయయ్యను పాముకఱచినసంగతి యింతకుముందేల చెప్పవైతివి? అట్లు చెప్పియున్నచో నేనాపామును చంపియుందునే.

బాహు—ఆహా! ఈకుమారుని ముద్దుమాట (ఇంద్రసేనుని ముద్దుపెట్టుకొనును)

భార—చాలు చాలు బాహుకా. ఇంద్రసేనా! రమ్ము.

బాహు—

తే. గీ. బహుళసంతాపవార్ధిలో । వలనునింగి
నట్టిమానసపు మది కా । హ్లాదమొసఁగి
చింతనెల్లను మఱపించఁ । జేయుఁగాదె
బాలకులసార మృదుతర । భాషణములు.

(నిష్క్రమించును)

---

రంగము;—[భీమరాజు ఆస్థానము;-భీమరాజు-సుదేవుఁడు-ఋతుపర్ణుఁడు-వార్ష్ణేయుఁడు-బాహుకుఁడు-]

ఋతు—భీమరాజా ! ఏమో స్వయంవరమంటివి. తత్ప్రయత్నమేమియుఁ గానఁబడదేమి?

భీమ—ఋతుపర్ణరాజర్షిచంద్రా!

తే. గీ. సకలరాజన్యవందిత । చరణయుగళుఁ
డైన నలరాజు వరియించి । నట్టిసాధ్వి
కకట వెండియుఁ బెండ్లిసే । యుంగఁదలఁచు
వాఁడనే! యంతఖలుఁడనే । పాపమతినె.

ఋతు—నీమాటలయందు నాకేమియు నర్థము దోఁచుటలేదు.

సుదే—ఋతుపర్ణభూమిపాలా! నీవు మమ్ము మన్నింపవలయును. నీయొద్ద నలభూమీశ్వరుఁడు ప్రచ్ఛన్నవేషమున నుండెనని యెఱింగి యాతని నిక్కడకు రప్పించుటకీయుపాయముఁ బన్నితిమి. దీనికి నీవాగ్రహింపవలదు.

ఋతు—సుదేవా! నలరాజు నాయొద్దనెచటనున్నాఁడు!

సుదే—(బాహుకుని సమీపించి)

సీ. తనజయధ్వజనము । ద్యద్వాత మరిధరా
పాలప్రతాప దీ । పంబులార్పఁ
దనశౌర్య భాస్కరా । తపము శాత్రవనృపా
ఖర్వగర్వధ్వాంత । గణముడంపఁ
దనపటహార్భట । స్తనితంబు వరరాజ
హంసమండలిగుండె । యలనగల్ప
దనవాహినీకాండ । ధౌర్త్యంబు ప్రతికూల
ధరణిభృత్సాల భే । దనమొనర్పఁ

తే. గీ. దనరుదోర్దండ మండితో । ద్దండచండ
మండలాగ్రవిచండల । కుండలీంద్ర
భక్షితమదాంధ పరిపంథి । బంధురాసు
గంధవహపాళి శ్రీనల । క్ష్మావరాళి.

సీ. తారకాద్రితుషార । హారారిడిండీర
తారకచ్ఛాయలఁ । దఱిమిపైచి
సారసారసటీ । సారగంగాసార
సారాశ్వభారతీ । శ్వరులనడచి
క్షీరవారిధిపూర । వారణారశతార
హారహీరరుచుల । నవహసించి



శారదనీరద । పారదనారద
సీరిపభ్రాపాళిఁ । బారఁద్రోలి

తే. రోదసీపేట్యఖండక । ర్పూరితమయి
యడరనెవ్వాని సత్కీర్తి । యతఁడు నిషధ
నేలుశ్రీనళనరపాలుఁ । డేపుగుశుభము
గలుగుఁగాత; యతనికిని ని । ష్కలుషమతికి.

వీరసేన కుమారుఁడై నిఖిలరాజన్యకిరీటరత్నరుచిదీపిత పాదసరోజుండై, ధరాచక్రము నిర్వక్రపరాక్రమమునఁ బాలించుచు భీమరాజపుత్రియగు దమయంతినిఁ బెండ్లియాడి, నందనోదయ భాగ్యమునంది, విధికృతమున మాయాజూదమున రాజ్యశ్రీల నోడి, నిజాంగనాసహితముగ నరణ్యములకేగి, యందు భార్యను విడిచి సర్పదష్టుఁడై బాహుకనామమున నాఋతుపర్ణనరపాలమౌళిని సేవించుచున్న సిద్ధసత్యకీర్తియగు మానలచక్రవర్తికి సకలమంగళములు ఘటిల్లుఁగాక! (ఫలాక్షతులియ్యబోవును)

బాహు—(త్రిప్పికొనక) బ్రాహ్మణోత్తమా! నన్నేల పరిహాసపాత్రునింగాఁ జేసెదవు. నే నేమి! నలుండనగుటయేమి?

సుదే—రాజచంద్రా! ఇఁక నీవు దాచినను దాఁగదు ప్రతివిషయము, నేను బాగుగ పరీక్షించితి. మొన్న నేను ఋతుపర్ణుని యాస్థానమునకు వచ్చి మాటలసందర్భమున నలుని దూషించినప్పుడు నీవు సమర్థించిన వాక్యము లట్టివా! స్వయంవరలేఖ నీవు చదువలేక కొలువు విడిచి వెడలుట తెలియదా! ఇంతయేల! ఆరాత్రి నీవు జీవలునితో శయనించియుండి దమయంతికై పడు పరితాపము నేను చాటుననుండి వినలేదా? ఇంతకంటె కావలసినదేమున్నది. నీకంఠస్వరము మాకు దెలియదా?

వార్ష్ణే—ఇది మానలరాజుకంఠస్వరమే!

భీమ—

తే. గీ. దాచెదేటికి నీవింక । ధరణిపాల!
ఈతలోదరి బాధల । కేమిగాని
జనకుఁ జూడంగఁ గాంక్షించు । తనయునైనఁ
గాంచి కృపమీఱ మమ్ము ర । క్షించుమయ్య.

ద్వితీయస్వయంవరమను పేరున నిన్నును రప్పించినందుకు నన్ను క్షమింపుము

మరలనిన్ను దమయంతి పడయుటయే ద్వితీయస్వయంవరమని యెఱుంగుము.

(దమయంతి - ప్రవేశము)

దమ—నాథా! మనోవాక్కాయకర్మములనీపద సేవదప్ప నన్య మెఱుంగను. రాజ్యచ్యుతిం బొందిన నేను విదర్భకు రానని నీవువచించిన కారణమున నిటకురప్పించుటకే నీచమార్గమునకు సమ్మతించి మహాపతకముం గట్టుకొంటిని. నీయెడబాటునకు నాదేహమునం బ్రాణములుపోవక నిలచియున్నవి. నీవునన్నుం గరుణింపవేని నీచరణసన్నిధినే ప్రాణములువిడిచెద.

(నలునిపాదములపైఁబడి)

ప్రాణేశ్వరా! నావలన నేవిధమైన దోషములేదు. నీవేరీతిని నాగుణములు బరీక్షింపం దలంచినను నందుకు సమ్మతింతును. అగ్నింబ్రవేశింపుమన్నం బ్రవేశింతును.

(ఆకసమున - దమయంతిమహాసాధ్వి - మహాసాధ్వి)

ఋతు—(నలునిఁజూచి) నలరాజా! ఇంకను దాచెదవేల! యాకాశవాణి సాక్ష్యము చాలదా!

ఇంద్ర—(నలునిసమీపించి) తండ్రీ! నన్నురక్షించి మాయమ్మను చేపట్టుము.

బాహు—(లేచి కర్కోటకునిఁదలఁచి) హేకర్కోటకా! నీవరముఁదీర్చుటకిదియే సమయము. కావున నన్నురక్షింపుము.

(ఒకవసనము బాహుకునిపైఁబడును. రూపుమాఱి నలుఁడగును.

మ. తరుణీ చింతిలఁబోకు; నీయెడల నే । తథ్యంబుగాఁ జేసితిన్
గురుదోషంబు లనేకముల్; మదిమహా । క్రోధంబునుం బూనకే
కరుణింపందగు నన్ను; వేగ, త్రిజగ । త్కల్యాణచారిత్రి; యె
వ్వరికిన్ శక్యము; ధాతవ్రాతలను ద । ప్పన్ జేయ భూమండలిన్.

(ప్రవేశము ఒకపౌరుఁడు)

పౌరు—(భీమరాజునుఁజూచి) మహారాజా! నలుఁడు మమ్మువిడిచి యరణ్యములకరిగినాడు. పుష్కరుఁడు రాజై, దేవలుఁడను బ్రాహ్మణమంత్రి యుపదేశమున మమ్ముఁగ్రూరముగ బాలించుచుండ నందఱమును గలసి పుష్కరుని బంధించితిమి. దేవలుఁడు తనకేమి హానిసేయుదురోయని బలవంతముగ మడిసినాడు. మారాజపుత్రుఁడు మీయొద్దనున్నాఁడఁట. కావున నక్కుమారునకు రాజ్యాభిషేకముఁగావించి మీరు మమ్ముఁబరిపాలింపవలయును.



భీమ—పౌరా! వీరెవ్వరో యానవాలు పట్టఁగలవా?

పౌరు—(సంతోషముతో) ఆహా! భాగ్యము. మానలరాజును జూచితిమి.

నలు—వార్ష్ణేయా! ముందు పుష్కరుని బంధవిముక్తునిఁ జేసి నారాకపురంబునకుఁ జాటఁబంపుము. ఇంద్రసేనునకే యువరాజ్యాభిషేకముఁ గావింతము.

ఋతు—నలరాజా! నీనిజవృత్తముఁ దెలియక యపరాధ మొనర్చితిగదా!

(నమస్కరించును)

నలు—ఋతుపర్ణమహీపాలా! ఎంతమాట పలికితివి. నీవుచేసిన గౌరవము - నాయెడలఁజూపిన ప్రేమ - వర్ణనాతీతము.

(ఆకసమున)

నలరాజా! నేను కలిని. నీచిత్తశుద్ధికి నేనుసంతసించి వరమిచ్చుచున్నాను. నిన్నునుదమయంతిని ఋతుపర్ణునిఁ గర్కోటకుని స్మరించినచో కలిబాధలు కలుగకుండుఁగాక ?

నలు—భాగ్యము భాగ్యము (సుదేవా) నీదయావిశేషమున నాలుబిడ్డలఁ గంటిని.

సుదే—రాజేంద్రా! నీవు నన్నుశ్లాఘింపవలదు నేను నీదయారసమునకుఁ బాత్రుఁడను.

నలు—ఋతుపర్ణభూమీశ్వరా! నిషధలో జరుగు నింద్రసేనకుమారపట్టాభిషేకమునకు నీవుకూడ రావలయునని నాకోరిక.

ఋతు—ఇంతకంటెఁ గావలసినదేమున్నది.

సుదే—మనకు వేళయయినదిరండు.

(అందఱు నిష్క్రమింతురు)

(నిషధయందు ఇంద్రసేనుని పట్టాభిషేకము చూపవలయును.)

ఇది పంచమాంకము

సర్వము సంపూర్ణము.



*

# చిత్రనళీయము

## అనుబంధములు

(శ్రీయుత సోమరాజు రామానుజరావుగారిచే రచియింపఁబడినవి.)

1 పౌరులు - జంఝూటి - అటతాళం.

1. భూపాల మా పావనుఁడవు । మేము । మీపాలి కాపుల మోదగలేము । భూ ।
2. దనుజుఁ జేమీతో సరాదు । మీ పినతండ్రికొడుకు రాయిడి మాకు పోదు । భూ॥
3. పురకాంతలగు వారిఁజూచి । దుష్ట । పరిభామలాడె కావరమది మీద ॥భూ॥
4. పట్టినామంబుల సొనట । నేల । బెట్టినావసక్కొట్టి బీరంబుగ మర ॥భూ॥
5. చెలఁగి మనను వెల్లుదాఁచి । నోట । బలుకరాని నుడులఁబలికెదాగొవ్వి ॥భూ॥
6. ఈబాధ మీరార్పకున్న । నయ్యా । బాబో । ఈపురి మాకు బ్రదుకులున్న ॥భూ॥

(2) నలుఁడు - బ్యాగ్ - రూపకము.

(1) ఔరా యీపురమా । ఆశ్చర్యమా సౌందర్యము ॥ఔ॥
భూరిగలుగు । ధారాధరిని । మీరువప్రము ॥ఔరా॥

(2) భూరికనకమయము । చారుగృహాంగణ । తీరవినిర్మితతోరణముల్ । కారుమొయిలు
దారివంటుడుఁ చారుగోపుర ॥ఔరా॥

(3) సారతరముగర । సాతలమంటెను । సారవిహీనముల్ ఖేయములున్ । ధరతరవి
చారయగుశ్రీ । దేవీకాపుర ॥ఔరా॥

3. నలుఁడు - బిన్‌ఫలాస్ - రూపకం

(మూర్తిమంత అనువరన)

కటకటా ! ఘటియిల్లెనిట్లు । పటమెనా దమయంతి
పటమె నాదమయంతిగా । యా । పటమె నాదమయంతిగా ॥క॥
దిటవుగాను రాధినాథ । డాత్యమిపుడు సలుపగా ।



కటకటా పాల్పడినవాఁడ । కాంతగగనకుసుమమే
కాంతగగనకుసుమమే । యా । కాంతగగనకుసుమమే ॥క॥

4. దమయంతి - బిన్‌ఫలాస్ - త్రిశ్రగతి

సుందరాకారమారా । సాహసోదారాధీరా । ఆ । ఆ । ఆ । ఆ । ఆ । ఆ ॥సుం॥
నీరజనయన । నీకిదితగు । నీరజనయన నీచా । ఆ । ఆ । ఆ । ఆ । ఆ । ఆ ॥సుంద

5. దమయంతి - కన్నడ - ఆది

ఇఁకనోర్వఁజాలనిబాలి । ప్రకటింపఁజాలనువిరాళి ॥యిఁక॥

1. అమ్మరో । మీరిటులాడుట కేమిఁక ।
నమ్మను, మీవచనాళీ ॥ఇ॥
2. మల్లెలనుచూసిటు గల్లలెగాని, త ।
ల్పంబున ననలముగనరే ॥యి॥
3. ఈసతినీకిఁక । లేదనిర్యాణలు
నానరనకుఁ జేరమ్మా ॥యి॥

6. (మారాకారా సుకుమారశరీరవలె)

చెలు—చాలు జేలా మదిజాలిదూలనేలా । మేలు బాలా ॥చా॥
యేలా । యీలీలదీనతనల । భూనాథుపై నావిరాళీ ।
దేలమేలా ॥చా॥
దమ—సఖి । మానకనా । మానసమా । మానవపతిలోనా । లీనత
గన । నారావిరాళీ ।
చెలు—బాలానీవీలీల । జాలిదూలిన మే । మీలీలనై పుడుమమ్మా
దమ—ఆ । కరుణాకరు । ధరణీవరు । జాడజాడరే
చెలు—॥చాలు జేలా॥

(7 నలుఁడు - సురట - తిశ్రగతి.

విమలకమలసదనవదన । విశ్వమోహినియాతా ।
ఔరా । యారా । యీనారీ ॥వి॥
ప్రవిమలసునాకోమలి యా । భానూరాంగియాదా ।
రతిరో । సతిమో । యలభా । రతిరో । సుతటి
ల్లతరో ॥వి॥

(8) దమయంతి

భూపాల - ఆది

నీరదేందుభాసమానవదనా। సారహార విలసితాంగశారద ॥నీ॥
భారమెల్లనీదెనమ్మ నాపతిగూర్పనిన్ను సన్నుతింతునమ్మ ॥నీ॥
ఈసురనాథులు భాసురగతినే। డిటులఁ
జరిత రోయనర్పఁదలంచిరి। దానపోషణీ। మంజుభాషణీ।
నీసమానదైవము భువిగలదే ॥నీ॥

(9) దమయంతి. (హాయిహైగిరిజాభవానీవలె పల్లవి)

ఈశ్వరా। కరుణానిధే। మాకేగతులు విధియుంచితో పర ॥మేశ్వ॥
విశ్వనాథా। విమలకరుణావృష్టిజూడు దయాకరా ॥ఈ॥
నావిభుడు మాయాదురోదర। భావన
ముమదిబూనెగా। సార్వభౌముని నాత
నిన్ భరియింపు మాగుణభూషణా ॥ఈ॥

(10) నలుఁడు - (హాలకహాజావో)

ఆహా। రాజ్యవియోగంబుఁ। నేనేగతినైపుదునో ॥ఆ॥
జ్ఞాతివినిర్మిత ఖేలనము
జాతిగనాకెటునమకూర్చెన్। మదినెనయించెనుగా ॥ఆ॥

(11) నలదమయంతులు

బిన్ ఫలాస్ - రూపకం

ఎంతటిగతిని ఘటించితో। ఏమిసేయమదిఁదలఁచితివో
ఆ - ఆ - ఆ - ఆ హావిధీ ॥ఎం॥
నుంతయుయిన చింతసేయక। సుఖతతులను
బాపగా। కాంతారములను గాసిల గాజరింపజే
యగా। నెటు। లిటు। పగ। దల। చితివో ॥ఎం॥

(12) నలుఁడు

కన్నడ—రూపకం.

ఘటనం బెటుగలిగెనో। ఈరూపం బెటు తొలగెనో। ఈశ్వరునకే తెలియ
వలయుగా ॥ఈ॥



నాగతి తుదకిటులయ్యె। వియోగము సమకూరెనుగా ॥ఈ॥
గురుతర శుభశీలా। సరసిజ ముఖలీలా। సురుచిరాంగి యగు నాదగు సుద
తి దూరమాయెనుగా ॥ఈ॥

(13) దమయంతి వీరనాయకుడు

(శరణనుము రామునివలె) శంకరాభరణం.

దమ—(ఆది) కలుషములు మానుమీ। బలవంతముగ
మహాత్మలౌ సతుల। గలియగదలచుట
నాశనంబునకె సుమి ॥క॥
త్రిశ్రి॥ గోపము - గురుతరసం - తాపము
అత్యంత - పాపము - అత్యంతపాపము
వీర—గోపమా! । గురుతర సం। తాపమా। అత్యంతపాపమా। ఆ
మా। ఏటిపిల్ల నాకు నీతులెంతదాక సెప్పెదవు। [illegible]
మరి మరి బాధింపకూ।
దమ—కట కటా! నీవ్రితఫలము। గడువగదర మానా! పటుతర దీపిక బడుకల।
భస్మగతి గనుగొనుమా। యిటు॥కలు॥

(14) వీరనాయకుడు–అటతాళం

(కోయ భాషతో కలిసిన తెలుగుపాట)




బెగ్గదైతోడ్ పిక్కవర్రి। నాపెగ్గనుండే రాసకుర్రి! ॥బె॥
నిమ్మ। నైతినే। నైతినే పిక్క। నన్ను నమ్మవె సక్కనిసుక్క ॥బె॥
కట్ట కల్లూ! దోడ్। తింతికే। నన్ను ముట్టితే తిప్పలే సుందరీ ॥బె॥

(15) ఋషులు—నాయికి ఆది

భవబంధహారా। పతిత పావనా। బ్రహ్మాది వందిత పదయుగళా ॥భ॥
అవిరళాత్మ ప్రభావనిమోహన। వివశీకృతమాయ పరికల్పన ॥భ॥
నారాయణ। సురపూజనీయ పర। మానంద సంతతాప్రమేయా దూరీకృ
సకల కలుష కేశవ। పరాత్పరా। వేదవేద్య శ్రీహరి ॥భ॥

(16) దమయంతి — ఆది.

పాపవిధియిటు వ్రాసెన్ । నాప్రాణపతి నెడ బాపెన్ । పాపు । జేయా । భంగి నయ్యోను ॥పా

ఎన్నడు నాహృదయేశుఁగాంతునో । మన్ననతో సుతులఁగౌఁగిలింతునో । దా శ్యం జేయుటు దాపురించెను ॥పా॥

(17) ఇంద్రసేనుడు

గుమోము జూపినాయననీవు వలె)

శహాన — రూపకం.

గారతినను । మోనగించితే । మది భ్రమసితివో! అల అల ॥

ననుచు । బలుకుచుంటినే । పాము కరచెనో । కా కింకే ॥

బిం కచ

సంపూర్ణము.






